అన్నపూర్ణావారి



# ఆత్మగౌరవం

నిర్మాత
డి.మధుసూదనరావు

దర్శకుడు
కె.విశ్వనాథ్

సంగీతం
రాజేశ్వరరావు

ఫొటోగ్రఫీ
సెల్వరాజ్

నవయుగ
విడుదల

NVKR

# ఉత్తరాలు

### కథలు

ప్రభంజనంగారి "మానవుడా! జయం నీకు!!" అన్న కథకి టైటిలు కుదరక పోయినా కథా వస్తువు చాలా సహజంగా ఉంది. కథనం ఉత్తమంగా సాగింది. ముగింపు బాగుంది. రచయితకు—మీాకు నా ధన్యవాదములు. శ్రీరంగం రాజేశ్వరరావుగారి కథ, "కలకంఠి కంటనీరు" కథనంలో దెబ్బతింది. పాఠకులు ఆ కథవల్ల ఏం తెల్సుకోవాలో అదే రాజేశ్వరరావుగారు తెలియ చెయ్యలేదు.

బి. సుమలత (విశాఖపట్నం)

*　*　*

ఎవరో మహానుభావుడు అన్నాడు—'ఎంత అర్థం లేకపోతే అంత గొప్పది' అని. అది ఆధునిక చిత్రకళని గూర్చి అన్న మాటలు కాని సాహిత్యాన్ని గురించి అన్న మాటలు కావు. కథలు సాధారణంగా అంతో ఇంతో చదువుకున్న ప్రతీ వారికీ బోధపడతాయి. కాని యీా ఉద్దేశాన్ని తారుమారు చేసింది శ్రీ "మందపాటి" రచన "శిలాలే ప్రాణాలు". ఇది నాకు మాత్రమే అర్థం కాలేదేమో అని మరికొంతమందినికూడా అడిగి చూశాను. అక్కడా ఏ రా శే ఎదురైంది. యీా కథర్థం అసలు (ఉంటే) రచయితకి తెలిసే ఉంటుంది అని సాహసించి యీా ఉత్తరం వ్రాస్తున్నాను. శ్రమ తీసుకొని మా సందేహాలకి సమాధానం యిస్తారని ఆశిస్తున్నాము—

జ్యోతి కథలో ప్రవేశించేవరకూ సాఫీగా బోధపడి యిక అక్కడినుండి బోధపడడం మానేసింది.

పేటి హాస్పటల్లో చనిపోవలసిన అవసరం ఏముంది ?

'దత్తు', జ్యోతులను చిరుతపులి ఎందుకు తినేసింది ?

"పాపం! చిరుతకేం తెలుసు—పగిలిన కప్పుకు తెలుసు"— అన్నారు రచయిత—కాని ఆ కప్పు తనకేం తెలీదు. రచయితకే తెలియాలి అంటోంది.

"అక్కా పలుసరించాడు లన్నారు"—యీా అక్కా ఎవరు ?

"శిలాలే ప్రాణాలుగా జీవించినా—ప్రాణాలవే తీసింది మరొక శిలవతి" యీా వాక్యానికి బొత్తిగా అర్థం బోధపడలేదు.

వీటన్నిటికీ రచయిత సహృదయంతో జవాబు యిస్తారని ఆశిస్తున్నాము.

సరోజ (టెక్కలి)

### సీరియల్

11—2—66 'పత్రిక'లో శ్రీకొండముది శ్రీ రామచంద్రమూర్తి గారు వ్రాసిన 'కరుణ' సీరియల్‌లో బి. ఏ. ప్యాసై, యం. ఏ. చదవుటకు వెళ్ళుచున్న విద్యార్థిని అంతదారుణముగా— 'థ్యాంక్స్'కి 'కంగ్రాచ్యులేషన్'లకు గల తేడా తెలియనట్లుగా వ్రాసినారు. అట్లు వ్రాయుటలో వీరియొక్క అభిప్రాయం తెలియుటంలేదు. ఈ రోజులలో చదువుకొన్నవారిమాటటుంచి, ఏమాత్రం ఇంగితజ్ఞానం ఉన్నవాళ్లకు కూడా వీటియొక్క అంటే 'థ్యాంక్స్' ఎప్పుడు ఉపయోగించాలో 'కంగ్రాచ్యులేషన్' ఎప్పు డుపయోగించాలో సంపూర్ణంగా తెలియునవుటలో అతిశయోక్తి లేదు. అటువంటిది బి.ఏ.ప్యాసై, యం.ఏ. కి వెళ్లుచున్న వీరభద్రానికి ఇంత చిన్నవిషయం తెలియదంటే ఎవ్వరూ హర్షించరు. ఈవిధముగా వ్రాయుట, వీరభద్రాన్నే గాదు, విద్యార్థి లోకాన్నంతటినీ అవమానించినట్లున్నది. ఇది చాలా శోచనీయం.

స్నేహలత (సామర్లకోట)

### పొరపాటు

మీా ఆంధ్రపత్రిక 11—2—66 తేదీ సంచికలో విషయానుక్రమణిక క్రింద ప్రచురించినట్లు "ఉత్తరాలు" శీర్షిక 4 వ పేజీలో కన్పించుటలేదు. పొరపాటున 'మిస్' అయినట్లుంది.

బి. సుమలత (విశాఖపట్నం)

* జరిగిన పొరపాటుకు చింతిస్తున్నాము.
—సం.

### వ్యాసాలు

వంట చేయడమన్నది ఒక కళేగానీ అవసరమైతే రోజు గడిచేందుకుపెద్ద వంట చేత కానక్కరలేదు. రక రకాల వంటలుచేత కాకపోవచ్చుగానీ రోజు మామూలువంట చేత కాక చేయలేని ఆడవాళ్లున్నారంటే అశ్చర్యమే. వంటచేసే [illegible] ఒక గొప్ప కొందరికి. దానికి చదువు సంధ్యలతో ప్రమేయంలేదు

ఇక కావాలని మగవాళ్ళచేత వంటచేయించే ఆడవాళ్ళు కూడా అరుదే. కానీ మన పత్రికల్లో, వ్యాసాల్లో, కార్టూన్లల్లో మగవాళ్ళ వంట తప్పించి యింకొక హాస్యమంటూ కనిపించదా అనిపిస్తుంది. అందులో మనతెలుగువాళ్ళలో మంచినీళ్ళు స్వయంగాముంచుకు తాగుతేనే మగతానానికి లోటు అనుకునేవాళ్ళున్నారు. అలాంటప్పుడు మన తెలుగు పత్రికల్లో మగవాళ్ళని నోరులేని వాళ్ళలా చేసి వంట చేయించేస్తున్నట్లు చిత్రించడం ఆడవాళ్ళకి, మగవాళ్ళకి కూడా సిగ్గుచేటు. అందులో హాస్యంలేదు—వాస్తవికత లేదు.

ఎక్కడో ఒకటో రెండో విచిత్రమైన సంఘటనలు ఆధారంగాచేసుకుని అదేమామూ అన్నట్లు వ్రాయడం సమంజసంకాదు. ఏది వ్రాసినా వాస్తవికంగా ఉన్నప్పుడే యింపుగా ఉంటుంది.

లక్ష్మీశర్మ (బొంబాయి)

*　*　*

4—2—66 తేదీ పత్రికలో శ్రీమతి ఇందిరాగాంధి జన్మదినము 1917 సం. జనవరి 19 తారీకు అని వ్రాశారు. ఆంధ్రపత్రిక డైలీలో ఇందిర 1917 నవంబరు 19 తారీఖున పుట్టిందని వ్రాశారు. రెండిటిలో ఏది కరెక్టు? దయచేసి తెలుపగలరని ఆశిస్తాము.

వై. సత్యనారాయణ (వర్కి క్రాసింగ్)

### వైజ్ఞానికగాధాళశి

డాక్టర్‌గారి యోగ్యతను సవాల్ చేసే యోగ్యత నాలోలేదు. జనా 31—12—65వ తేదీ సంచికలో ప్రచురించిన 42వ గాథ "కవి సమయాలు" లో సప్త సముద్రాలూ కవుల వూహాగానాలే యనడంలో డాక్టర్‌గారు పొరబడ్డారనుకుంటూను. జ్యాగ్రఫీ చదివిన ఏ విద్యార్థయినా పంచమహా సముద్రాల అస్తిత్వాన్ని కాదనలేరు. మరొకసారి చెప్పుకోవాలంటే, ఆర్కిటిక్ మహాసముద్రము, పసిఫిక్ మహాసముద్రము, అట్లాంటిక్ మహాసముద్రము, హిందూమహాసముద్రము మరియు అంటార్కిటిక్ మహాసముద్రము—ఇవి పంచ మహాసముద్రాలు. ఇంకా ఉండే బిడ్డ సముద్రాల లెఖ్ఖ విడిచిపెట్టండి. ప్రత్యక్షంగా కనబడే ఇన్ని సముద్రాలను మనము కవుల వూహాగానాలే —నమ్మెం

## ఉత్తరాలు

కవుల రచనలలో తమ కాలమునాటి పరిస్థితులు ప్రతిబింబిస్తాయి. అందుకే ఒక రాజు విషయమై తెలుసుకునేందుకు చరిత్రకారులు అతని కాలములో రచింపబడిన గ్రంథాలు పరిశీలిస్తారు.—ఇది హిస్టరీ విద్యార్థులకు తెలిసిన విషయమే. అందుకు కవుల కల్పనలు ఉత్త కల్పనలని త్రోసి పుచ్చలేము. అతని వూహాగానాలతో, ప్రత్యక్షంగా నైనా, పరోక్షంగానైనా, ఒక తథ్యం ఉంటుంది.

అంతవరకెందుకు. రామాయణ మహాభారతాది గ్రంథాలు చదివినవారికి అగ్నిబాణాలూ వగైరా ఉపయోగింపబడే వివరాలు తెలియవచ్చు. ఈ గ్రంథాలు పూర్వయుగాలనాటి రచనలు. ఈ రచనల పునాది వూహాయే గదా ! ఐతే అవి తథ్యరహితవూహాలేనా? ప్రత్యక్షంగా అగ్నిబాణాలనూ (Rocket) ఇంకా ఎన్నెన్నో నమ్మజాలని నగ్నసత్యాలైన వింతలనూ చూస్తూ ఈ 20 వ శతాబ్దంలో పైనాటివి కవివూహాగానా అనుకోవడం కేవలం దురన్యాయం గాక ఇంకేమిటి ? సప్త సముద్రాలకూ అగ్నిబాణాలకూ ఎట్టి సంబంధం లేనప్పటికీ వూహలో ఉండే సత్యాన్ని నిరూపించడానికి ఉదాహరణగా సూచించడమైనది. క్షమార్హుణ్ణి.

కె. ఆనందరావు (దులియాజాన్)

* * *

శ్రీ హెచ్. జె. భాభా అకాలమరణంవల్ల ఇండియాకు తీరని నష్టం ఏర్పడినదని నా అభిప్రాయము. శ్రీ జహంగీర్ భాభా మరణవార్త విని విచారించని భారతీయు డెవరు యుండరు. మన దేశమునకు అణుశక్తి విషయములో ప్రపంచములో ప్రఖ్యాత స్థానము ఏర్పడుటకు శ్రీ భాభాయే మూల పురుషుడు. 1966 సంవత్సర ప్రారంభములో మన దేశము గొప్ప రాజకీయ నాయకుడయిన శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి గారిని, గొప్ప శాస్త్రవేత్త అయిన భాభాగారిని కోల్పోవుట మన దురదృష్టం. వ్యాసములో పేర్కొన్నట్లు శ్రీ జహంగీర్ భాభా నెలకొల్పిన సంస్థలని మరింత అభివృద్ధి చెయ్యటం ఆయన స్మృతికి మనం చెయ్యగలిగిన గౌరవం.

కె. వెంకటేశ్వర్లు (రాజమండ్రి)

## సవరణ

18—2—66 సంచికలో 12 వ పేజీలోని శ్రీ బాసాని సుదర్శనరెడ్డిగారి 'ఇష్టాగోష్ఠి'లో శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి వయస్సు 20 సంవత్సరము లని పొరపాటున ప్రచురింపబడినది. అది 29 సంవత్సరములుగా పాఠకులు గమనించ ప్రార్థన.

సం॥

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 11—3—'66

విశ్వావసునామ సం॥ ఫాల్గుణ మాసం బ॥ పంచమి

సంపుటము : 58 సంచిక : 28

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా |
|---|---|
| | రూ. పై. |
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |


## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

సం॥

## మనలో మాట

ప్రఖ్యాత విప్లవయోధుడైన శ్రీ వినాయక దామోదర్ సావర్కార్ ఫిబ్రవరి 26వ తారీఖున, తమ 83వ యేట బొంబాయిలో కాలధర్మం చెందారు. భారత స్వాతంత్రోద్యమంలో శ్రీ సావర్కార్ సల్పిన కృషి, చేసిన త్యాగాలు అఖండ మైనవి. శ్రీ సావర్కార్ విప్లవయోధుడే కాకుండా మంచి వక్త, గొప్ప రచయిత కూడా. 'వీరసావర్కార్'గా ఆయన యావద్భారత ఖ్యాతి నార్జించు కున్నారు. కీర్తిశేషులైన వీర సావర్కార్ జీవిత విశేషాల్ని తెలిపే వ్యాసాన్నొక దాన్ని ఈ సంచికలోని 6వ పేజీలో చూడవచ్చు...

* * *

అండమాన్ దీవులలోని విశేషాల్ని తెలిపే వ్యాసాన్నొక దాన్ని ఈ సంచిక లోని మధ్య పేజీలలో వేశాము. వ్యాసరచయిత శ్రీ ఎం. వరదాచారి అండమాన్‌లోనే ఉంటున్నారు. ఫొటోలు కూడా వారు పంపినవే...

* * *

హైదరాబాద్ ఫిలిం పరిశ్రమ అభివృద్ధిని చర్చించే వ్యాసాన్ని యిదే సంచికలో పాఠకులు చూడగలరు...

* * *

సంచిక తయారయే సమయానికి అందక పోవటంవల్ల ఈ వారం ఊర్మిమెన్ కార్టూన్ వేయలేక పోయాము...

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : హిందీ నటి షర్మిలా ఠాగూర్


కథలు :

| | |
|---|---|
| యవనిక | — 14 |
| డాషిట్ | — 30 |
| దొంగ | — 42 |

సీరియల్ కథ:

| | |
|---|---|
| కిరుణ | — 22 |

శీర్షికలు : వ్యాసాలు: సినిమాలు

ఉత్తరాలు — 3, వీరసావర్కార్ — 6, న్యూఢిల్లీ లేఖ—7, హాలీవుడ్ ప్రణయాలు — 9, రంగావలోకనం — 12, వైజ్ఞానిక గాథా శతి — 20, అండమాన్ .... ఊంగీ — 28, గోవా జానపద గాథలు — 36, బాలసాహితి—38, వారఫలం — 40, హైదరాబాద్ ఫిలిం పరిశ్రమ — 46, సినిమా వార్తలు — 49, పుస్తకాలు—53.



దామోదర్ సావర్కార్

# వినాయక దామోదర్ సావర్కార్ అస్తమయం

వినాయక దామోదర్ సావర్కార్ ఫిబ్రవరి 26 వ తేదీ బొంబాయిలో తన 84 ఏట మరణించారు వీరి మరణంతో, భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఒక తరం వారి సంఖ్య మరింత క్షీణించింది 1863లో నాసిక్ జిల్లాలోని భాగూర్ గ్రామంలో జన్మించిన సావర్కార్ చిన్నప్పటినుంచి రాజకీయాలలో ఆసక్తి చూపించారు. చాపేకర్, లోకమాన్య బాలగంగాధర్ తిలక్‌లు వారిని బాగా ఆకర్షించారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నవారిని అప్పటి అధికార వర్గాలు దండించటంలో ఆశ్చర్యంలేదు సావర్కార్ డిగ్రీ విషయంలో కూడా చాలా ఇబ్బంది కలిగించారు కాని ఆయన ఎలాగో ఇంగ్లండ్ వెళ్లి చదువుకునే అవకాశం కల్పించుకుని, అక్కడ 'ఫ్రీ ఇండియా సొసైటీ' స్థాపించారు 1910 లో ఆయనని అరెస్టు చేశారు ఆయన సాహసంతో తప్పించుకుని మార్సెయిల్స్‌లో దిగటం, అక్కడ దురదృష్టవశాత్తు పట్టుబడటం అందరికీ తెలిసిన విషయాలే.

సావర్కార్‌కి ఆ తర్వాత 50 సంవత్సరాల కారాగారవాసం శిక్షగా విధించారు కారాగృహంలో ఆయన చాలా కష్టాలు అనుభవించారు. 1924 లో సావర్కార్‌ని రత్నగిరికి పంపించారు. రాజకీయాలలో పాల్గొనరాదనే నిబంధన పెట్టారు. ఆయన తదనుగుణంగా తన దృష్టిని సాంఘిక సమస్యలవైపుకి మరల్చారు. హైందవ సమాజంలో అసహ్యం కలిగించే అంశాలన్నింటిని ఖండించారు హరిజనుల ఉద్ధరణకి కృషి చేశారు 1937 లో కాంగ్రెసు పదవిలోకి వచ్చింది. సావర్కార్‌ని విడుదల చేయించింది 1940 లో శ్రీ సావర్కార్, నేతాజీ సుభాష్‌చంద్రబోస్‌లు మిలిటరీ విప్లవం తీసుకురావటానికి పథకాలు వేశారు.

శాంతియుతంగా స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించి యుద్ధానంతరం బలహీనమయిన బ్రిటిషువారి సహాయంతో దేశాన్ని విడుదల చేసుకున్న కాంగ్రెసు పక్షంలో ఎటువంటి రాజకీయవాది కయినా స్థానం లభించేది, హిందూ మహాసభ అధ్యక్షుడుగా ఎన్నిక అయిన శ్రీ సావర్కార్ కూడా కావాలనుకుంటె కాంగ్రెసులో చేరి ఉండవచ్చునేమో! కాని ఆయన ఆ మార్గాన్ని అనుసరించలేదు హైందవ సమాజాన్ని 'లోపలనుంచే' సంస్కరించాలని, భారత రాజ్యాంగంలో హైందవ మతానికి ప్రాధాన్యం ఉండాలనే ఇటువంటి సంస్కరణ నిలుపుతుందని సావర్కార్ 'రాజకీయాలని' బలపరచేవారు వాదిస్తారు ఇటువంటివారికి నేడు అమలులో ఉన్న 'సెకులర్ స్టేట్' లో ఏ స్థానం ఉండగలదు ? ప్రజాదరణతో ఎన్నిక అయిన కాంగ్రెసుపార్టీ అధికారాన్ని స్వీకరించి హైందవ సమాజంలో శాసనసభల ద్వారా చాలా అభివృద్ధి సాధించగలిగింది సంఘసంస్కరణ ప్రభుత్వాలు కాక వ్యక్తులే సాధించాలనే వారు లేకపోలేదు స్వాతంత్ర్యం ముందు గాంధీగారి నాయకత్వంకింద ప్రజలలో కలిగిన చైతన్యం నేటి ప్రభుత్వం సాధించినదానికన్నా, ఒకవిధంగా చూస్తే అధికమే అనిపిస్తుంది

శ్రీ సావర్కార్ తన వీలునామాలో తన దహనక్రియల విషయంలో, మరణానికి సంబంధించిన ఇతర వివరాల విషయంలో కొన్ని సూచనలు చేశారట ఇది వారి విశాల దృక్పథాన్ని తెలుపుతుంది కాని భారతదేశం శతాబ్దాలుగా మహమ్మదీయ పరిపాలన కింద ఉండినదనే సంగతిని ఆవేశం లేకుండా పరిశీలించనివారు మన అభిమానానికీ, గౌరవానికీ, ప్రేమకీ ఎంత పాత్రులయినప్పటికీ ఆధునిక, సాంకేతిక సమాజాలలో ఎటువంటి నిర్మాణాత్మక పాత్ర వహించగలరనే ప్రశ్నని మనకి మనమే వేసుకోవటం అవసరం.

—ఒక విలేఖరి

న్యూఢిల్లీ లేఖ

# కుంటువడిన ఆర్థిక పరిస్థితి: ప్రభుత్వ విధానాలు

పార్లమెంటులో ఆహార విధానాన్ని, ఆర్థిక పరిస్థితినీ చర్చించారు. భారత సైనికుల సాహసం పాకిస్థాన్‌ని కాశ్మీరులో అరికట్టింది కాని ఆర్థిక పరిస్థితిని పాకిస్థాన్ బాగా చెడగొట్టింది. కొంతదాకా అమెరికా అధ్యక్షుడు శ్రీ జాన్సన్ దీనికి తోడ్పడ్డా డనవచ్చును. యుద్ధ సమయంలో విదేశీ సహాయం ఆగిపోవటంతో దేశం ఆర్థిక పరిస్థితి కుంటువడింది.

భారత ప్రధాని అమెరికాకి అనుకూలంగా కొన్ని ప్రకటనలు చేసిన తర్వాతనే అమెరికా అధ్యక్షుడు సహాయం తిరిగి ప్రారంభించటానికి అంగీకరించారు. అమెరికా ఉప—అధ్యక్షుడు శ్రీ హ్యూబర్ట్ హంఫ్రీ, భారతదేశంలోకి కొన్ని అవసర వస్తువులని దిగుమతి చేసుకోనటానికి 10 కోట్ల డాలర్ల అప్పు ఇస్తున్నామని ప్రకటించారు. ఈ ప్రకటన తర్వాత అధికారవంతంగా జరగవలసిన తతంగం చాలా ఉంది.

ఒప్పందాల సంతకాలు, దిగుమతి లైసెన్సుల విడుదలలు, ఉపన్యాసాలు, సభలు చివరికి అమెరికాలో ఎగుమతి వగైరా. ఇదంతా జరగటానికి కావలసిన 6 మాసాలలో, భారత కర్మాగారాలలో పని వెనకబడక తప్పదు.

ఈ సంవత్సరం వర్షాలు పడక ఎన్నో రాష్ట్రాలలో కరెంటు సప్లయి తగ్గించవలసి వచ్చింది. క్షామ ప్రాంతాలలో ప్రజలకి సహాయపడే కార్యక్రమాలు మొదలుపెట్టాలి. రాష్ట్రపతి తమ ప్రసంగంలో, "ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తి తగ్గటంచేత ఇతర ఖర్చులని తగ్గించుకోనటం అవసరం" అన్నారు. "ప్రణాళికలకి సంబంధించని ఖర్చులని తగ్గించాలని ప్రభుత్వం చూస్తోంది. కాని కొన్ని సందర్భాలలో ఇది సాధ్యంకాదు. ఇటీవలే జరిగిన యుద్ధంలో నష్టపడినవారికి కొత్త వసతులు కల్పించాలి. ఉత్తర సరిహద్దుల వద్ద పరిస్థితినిబట్టి రక్షణ వ్యయం అధికం కాక తప్పదు. క్షామ ప్రదేశాల ప్రజలకి సహాయం చెయ్యాలి. ఈ పరిస్థితులలో పొదుపు చెయ్యక తప్పదు." అన్నారు ఆయన.

ఇదంతా బాగానేఉందికాని, ఖర్చు తగ్గించే విధానాలు అమలు సరిచేది ఎవరు?

యేల్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా ఉంటున్న శ్రీ చార్లెస్ ఇ. లిండ్‌బ్లామ్ ఇంతకిముందుదాకా న్యూఢిల్లీలోని అమెరికన్ రాయబార వర్గానికి ఆర్థిక సలహాదారుగా పని చేశారు. జనవరి 'ఫారిన్ ఎఫైయిర్స్' సంచికలో ఇలా రాశారు--

"15 సంవత్సరాల ప్రణాళికల సహాయంతో భారతదేశం ఆహార ధాన్యాల ఉత్పత్తిని 50 శాతం పెంచింది. 1961, 1964ల మధ్య వ్యవసాయాభివృద్ధి కొంచెం వెనకబడిందికాని, 1964—65లో 10 శాతం ఎక్కువ అయింది. ఈ లాభాలన్నీ జనాభా పెరుగుదలవల్ల రద్దు అయిపోయాయి. అందుచేత వ్యక్తిగతంగా చూస్తే, పెరుగుదల 50 ఏళ్లలో 15-20 శాతమే అయి



ప్రణాళికామంత్రి శ్రీ అశోక మెహతా న్యూఢిల్లీలో ఇటీవల భూసంస్కరణల గోష్ఠిని ప్రారంభిస్తున్న దృశ్యం.

ఉంటుంది. తరిఫీదులేని పారిశ్రామికులతో, నిస్సారమయిన భూమితో ఎలాగో ఈ అధి కోత్పత్తిని సాధించగలిగింది భారతదేశం.

"ఇంకా అధికంగా ఎందుకు కృషి చెయ్యలేకపోయింది? నిస్సారవంతమయిన భూమి, నాసిరకం విత్తనాలు, సరయిన యంత్ర సామగ్రి లేకపోవటం, పురాతన కాలానికి చెంద వలసిన నాగళ్ళు, ప్రయోజనం తక్కువకల పనిముట్లు, బలంలేని ఎద్దులు, తరిఫీదు లేని కర్షకులు, తగుమాత్రం పెట్టుబడి లేక పోవటం—వీటివల్ల. ఇవేకాక, వళ్ళువంచి పని చెయ్యటం హీనమనే భావం, కుల మత విభేదాలు, సాంప్రదాయాల కట్టుబాట్లు, మూర్ఖత్వం, అస్థైర్యం, లంచగొండితనం. ఉదాసీనత—వీటినీ గమనించాలి.

"నీటిపారుదల సంగతి? మొదటి, రెండవ ప్రణాళిక ప్రారంభం, మూడవ ప్రణాళిక మధ్యలో భారతదేశంలో అదనంగా 2 కోట్ల ఎకరాలు నీటి పారుదల పథకాల కిందకి వచ్చాయి. కాని అమెరికాలోలాగ 'నీటి పారుదల' అంటే నమ్మదగినదికాదు! నీరు ఎప్పుడు వస్తుందో, ఎంత వస్తుందో తెలియదు. నీటి ఎద్దడి వచ్చినప్పుడు పంట పూర్తిగా పోకుండా కాపాడగలుగుతుందేమో, అంతే. మంచి పంట పండాలంటే కావలసిన నీటి పారుదల ఇవ్వటం అత్యవసరం అని ఈ శాఖ మంత్రివర్గంవారు గ్రహించినట్లు కనిపించదు. నీరు నిలిచి ఎంతో పంట చెడి పోయిన దనే ఆరోపణలోనూ నిజం ఉందనిపిస్తుంది. ప్రభుత్వం ప్రాజక్టుల విషయములో చాలా పెట్టుబడి చేసింది. కాని, ఇవి సకాలంలో పూర్తికావు. సహాయం కావలసిన ప్రాంతాలకి అది శీఘ్రంగా చేరదు. వీటన్నిటినీ బట్టి పెద్ద ప్రాజక్టులు ఉత్పత్తిని హెచ్చించటానికి బదులు తగ్గించాయేమోనని కూడా వూహించవచ్చు.

"వ్యవసాయంలోలాగే ఎగుమతిలోనూ, నిస్సహాయ పరిస్థితికన్నా కొన్ని వ్యాపార వర్గాలకి దూరపు చూపు లేకపోవటమే నష్టం కలిగిస్తోంది, అనవచ్చు. ప్రస్తుతం అమలులో ఉన్న దిగుమతి నిర్బంధాలు బ్లాక్ మార్కెట్ అలవాట్లని ప్రోత్సహిస్తున్నాయి. రూపాయి నిజం విలువ పడిపోయి ఎగుమతి వస్తువుల ధరలు అధికంగా కనిపించి, ఎగుమతులే పడిపోతున్నాయి."

"భారతదేశానికి వచ్చినవారు ఇక్కడి దారిద్ర్యం, అశుభ్రత, కులవిభేదాలలమానుష నుల స్వభావం, ఉదాసీన వైఖరి, నిర్లక్ష్యం లంచగొండితనం చూసి ఆశ్చర్యపోతారు. కాని వీటినిబట్టి భారతదేశం భవిష్యత్తుని నిర్ణయించటం మంచిదికాదు. ఈ దేశం ప్రస్తుతం ఎలా ఉందో తెలుస్తుందికాని ఎలా ఉండాలో తెలియదుకదా! ఈ దుర్గుణా లన్నీ లేకపోతే భారతదేశమూ ముందుకు వచ్చిన దేశమే అయిపోతుంది కదా! వాటి ప్రభావం బాగా తగ్గిపోయి ఉంటే ఈ సరికి భారతదేశం ఎంతో ముందంజవేసి ఉండేది. కొద్ది కొద్దిగా మాత్రమే తగ్గుతూ ఉంటే భారతదేశం నవ నాగరికత వైపు అతి నెమ్మదిగా పాగిపోతున్నదని వూహించ వచ్చు. ఇది సరయిన వూహ. ఈ విషయాలే ఆలోచించగలిగిన ప్రతి మనిషికీ భారత దేశ భవిష్యత్తుమీద ఆసక్తిని కలిగిస్తాయి. భారతదేశం సమస్యలు ఎటువంటివో చెప్తాయికాని అవి పరిష్కారానికి లొంగవని సూచించవు."

ఒక ప్రపంచ బాంక్ మాత్రమే భారత దేశం ఆర్థిక పరిస్థితిని విమర్శిస్తున్న దనుకో నక్కర లేదన్నమాట. ప్రధాన మంత్రి త్వరలో వాషింగ్టన్ వెళ్ళినప్పుడు



ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ.

ఇటే ధోరణిలో ఆమెని ఎందరో ప్రశ్నలు అడుగుతారు.

సహాయంచేసే దేశానికి రెండు మార్గాలు ఉన్నాయని ప్రొ. లిండ్‌బ్లామ్ అన్నారు. ఒకటి, సహాయంతోబాటు షరతుల పెట్టటం. రెండు, విచక్షణ లేకుండా ఉత్పత్తికి తోడ్పడే సహాయం మాత్రం చెయ్యటం. మూడవ గత్యంతరం ఏదయినా ఉన్న దేమోనని భారతదేశం ఆలోచించిచూడాలి. అంటే, ఉత్పత్తి పెరిగే విధానాలని ప్రోత్సహించాలి. ఈవిధంగా సహాయమూవస్తుంది, మన స్వాతంత్ర్యాన్ని అమ్ముకున్నామనే అప వాదూ ఉండదు.

ఇటువంటి విధానాలని గనుక అవలంబించేటట్లయితే ఆ విషయం నిర్భయంగా, స్పష్టంగా చెప్పటం అవసరం.

ఏది ఎలా ఉన్నా, ప్రస్తుత పరిస్థితి ఇలా కొనసాగటానికి వీలులేదు. విదేశాలనుంచి పెట్టుబడిధనం ఇంకా వచ్చేట్లు చూడాలి.

మరోవిధంగా చెప్పాలంటే, జయపూర్ సమావేశంలో శ్రీ కామరాజుని నిర్మించమని కోరిన కమిటీని వెంటనే నిర్మించి—అందులో తిక్కలు లేని వ్యక్తులని వేసి—కర్తవ్యాలని వెదకాలి.

ప్రభుత్వాన్ని కాంగ్రెసు సభ్యులూ, ప్రతిపక్షంవారూ కూడా విమర్శిస్తూ ఉంటారు. "ఏవో కుక్కలు మొరిగితే ఏనుగ ఆగుతుందా?" అనే ధోరణిలో వీరి విమర్శలని పట్టించుకోరు. పార్లమెంటులో ఖాళీగా కనిపించే 'ట్రెజరీ బెంచి'లే దీనికి నిదర్శనం. ఇందులో ఆశ్చర్యపడవలసినది ఏదీలేదు. ఎంత విమర్శించినా వోటింగు దగ్గరకి వచ్చేసరికి మాత్రం కాంగ్రెసు సభ్యులు ప్రభుత్వాన్నే బలపరుస్తారని అందరికీ తెలుసు. అంతేకాక, కాంగ్రెసు సభ్యుల విమర్శ, ఎన్నికల ప్రచారానికి పనికివస్తుంది; ప్రభుత్వంలోని వారందరూ ప్రధాన మంత్రితో అన్నిటిలోనూ ఏకీభవించటం లేదని తెలుపుతుంది. నిజం చెప్పాలంటే, ఎస్. కె. పాటిల్‌లాంటి వారెవరో తప్ప, డిప్యూటీ మంత్రులు కూడా తమ పార్టీ వారితో కలిసి తిరగడానికి ఇష్టపడరు.

శ్రీమతి ఇందిరాగాంధి, పార్లమెంటులో చాకచక్యంతోనే నడుచుకుంటున్నారు కాని, ఎవరోతప్ప, ఆమె సహచరులుమాత్రం తమ నైపుణ్యాన్ని చూపించుకోలేక పోతున్నారు.

—శ్రీ కృష్ణ



రీటా హేవర్త్.

# హాలీవుడ్ ప్రణయాలు-3

గాబీ బ్రుయర్

శాండ్స్ హోటల్లో ఫ్రాంకీ(సినాత్రా)కి వాటాఉంది. అందుచేత అక్కడ తన కార్యక్రమాన్ని తనే ఏర్పాటు చేసుకున్నాడు. అప్పటికి కొంత కాలంగా ఫ్రాంకీ సినిమాతారగా పేరు సంపాదించుకుంటున్నాడు కాని గాయకుడుగా కొంచెం వెనకబడ్డాడు. ఈ తరుణంలో మళ్ళీ పాటగాడుగా తన కీర్తిని నిలబెట్టాలని నిశ్చయించుకున్నాడు. అయినా అతన్ని 'సభా పిరికి' ఆవరించింది.

మధ్యాహ్నం ఒంటిగంటకి భోజనం ముగించాము. కొంతసేపు ఈత కొలనులో మునిగి తేలాము, ఈత కొట్టాము. తర్వాత ఎండలో వడుం వాల్చాము. "ఫ్రెంచి బొమ్మా, భయంగా ఉంది. సినిమా నా కొక హాబీ మాత్రమే. పాట కచేరీలు చెయ్యటమే నా అసలు వృత్తి. నేను పొట్టివాడిని— (నిజానికి అతను 5 అడుగుల 8 అంగుళాల మనిషి) పాడినప్పుడే 6 అడుగుల వాడిననిపిస్తుంది.

"అంతేకాదు. నా మాజీ భార్య ఆవా గార్డ్నర్ ఇక్కడికి దగ్గరలోనే ఉంది. ఆమె చుట్టూ దోమింగ్విన్ అనే స్పానిష్ 'బుల్ ఫైటర్' తిరుగుతున్నాడు. వీలయినప్పుడెల్లా నన్ను వేళాకోళం చేస్తాడు."

"ఫ్రెంచి బొమ్మా ! ఇక్కడే ఉండిపో! నువ్వుంటే నాకు మంచి ధైర్యంగా ఉంటుంది. నువ్వు నాకు అదృష్టం తెస్తావని నమ్మకం ఉంది నాకూ !" అని చెప్పుకుపోయాడు ఫ్రాంక్ సినాత్రా నాతో.

అప్పుడు నేను దీర్ఘ ప్రయాణానికి సిద్ధం అయి రాలేదు. కాని ఉండిపోయాను. ఆ కళ్ళు, ఆ కంఠస్వరం, ఆ ఎడారి వాతావరణం నన్ను కట్టివేశాయి.... అసలు మనం జీవించేది ఒకసారి మాత్రమే కదా !

ఇన్ని సంవత్సరాలుగా ఫ్రాంకీ స్నేహితురాలుగా ఉన్నాను. నన్ను అందరూ అడుగుతారు — "సినాత్రా పట్టి తిక్కమనిషి. అతనితో స్నేహం నిలవటం కష్టం. నువ్వెలా వేగగలిగావూ?" అని.

నా సమాధానం—"అతని స్నేహం కావాలంటే అతని జోలికి పోకపోవటమే."

అతనికి లొంగిపోవటం — అంటే అందరూ ఆ మాటని అర్థం చేసుకునే విధంగా అయితే—చాలా తేలిక. అతన్ని లొంగదీసుకొనటమూ అంత కష్టం కాదేమో ! అందంగా ఉంటే చాలు. అలాగని అతని వలపుకోసం పోటీలేదని కాదు. హాలీవుడ్‌లో ఎందరు అందగత్తెలు అతన్ని కోరటంలేదు ? ఫ్రాంకీకి ఎందుకోగాని కులలంటే సరదా. వీలయినప్పుడెల్లా ఒకే రకంగా కనిపించే ఆడపిల్లల జంటతో తిరుగుతూ ఉంటాడు. చిన్నప్పుడు అతను పడిన కష్టాలని ఈవిధంగా మరిచిపోదామని ఫ్రాంకీ భావనేమో. తను పొట్టివాడిననే భావం అతన్ని బాధిస్తుంది. ఇద్దరు ఆడపిల్లలతో కనిపిస్తే ఈ సంగతి మర్చిపోయి, 'ఎంత మగవాడు!' అని ఆశ్చర్యపోతారని అతను అనుకుంటాడని నా అభిప్రాయం. అతని వలపులూ, ప్రణయాలూ ఎక్కువ కాలం నిలవవు. అతనితో తిరిగే ఆడవారి స్వార్థంవల్ల నయితేనేమి, వారి సంకుచిత మనస్తత్వాలవల్ల నయితేనేమి పోట్లాటలు తొందరగా వచ్చేస్తాయి. ఫొటోగ్రాఫర్లు తమ బొమ్మలుతీసి ఆ ఆడపిల్లలకి ప్రచారం చెయ్యటం అతనికి గిట్టదు. వీటన్నిటికన్నా ఫ్రాంకీకి బుద్ధిమాంద్యం కలవారిని చూస్తే మరీ చిరాకు.....

నే నెప్పుడూ మా స్నేహానికి విలువ కట్టలేదు, వాడుకొనటానికి ప్రయత్నించలేదు. అందుకనే, "గాబీ మంచి పిల్ల!" అంటూ ఉంటాడు.

నా జీవితం నేను గడుపుతున్నాను. నా పొట్ట నేను పోషించుకుంటున్నాను.

ఫ్రాంకీ నాకు పొద్దునే కాఫీ, ఫలహారాలు తీసుకువచ్చి యిస్తే ఏమిటి ? నాతో గంటల తరబడి కాలం గడిపితే ఏమిటి ? అతనికోసం విపరీతంగా 'సేమియా' మెక్కితే ఏమిటి ?

ఫ్రాంకీ పూరికే సేమియా తింటాడు. తన బరువు తక్కువ అనీ, పిండి పదార్థం తింటే పెరుగుతుందనీ అతని వూహ! కాని, పాపం అతని 120 పవున్లు పెరగనేలేదు.!

పగలంతా ఈతకొలను దగ్గర, లోనలా గడిపేవారం. అతన్ని స్నేహితులంతా అక్కడే పోగయేవారు. (అతని అంగరక్షకులు కూడా అక్కడే నక్కి ఉండేవారు.)

వీరందరిలో ఒక వ్యక్తి మాత్రం దూరంగా ఉండిపోవటం నేను గమనించాను.

ఆ వ్యక్తి ఎవరు ? రీటా హేవర్త్ !

ఆమె అలీఖాన్‌కి విడాకులు యిచ్చింది. త్వరలో కోర్టువారు కూడా దానిని ప్రకటించబోతున్నారు.

రీటా సరిగ్గా అలంకరించుకునేది కాదు. ఎవరితోనూ సరదాగా కబుర్లు చెప్పేదికాదు. ఒక్కసారి మాత్రం నాతో అంది, "గాబీ! అలీఖాన్‌కి ఎందరో భార్యలుండటం తప్పుగా కనిపించలేదు. అది నాకు నచ్చదు. ఇదంతా చాలా బాధాకరంగా ఉంది." అని కన్నీరు పెట్టింది.

# హాలీవుడ్ ప్రణయాలు

ఇదంతా సరే, అసలు విషయం మర్చిపోయాను. ఫ్రాంక్ ప్రతి పాటనీ శ్రద్ధతో సాధన చేసేవాడు. ఒక్క వయొలిన్ శ్రుతి తప్పితే ఆర్కెస్ట్రా నంతటినీ ఆపి మళ్ళీ ప్రారంభించేవాడు. (తర్వాత రెండు వేల ప్రేక్షకుల, శ్రోతల ముందు ఫిడేలు వాద్యగాడితో, పాటని ఆపి, ఇలా అనటం విన్నాను — "బాబూ, నువ్వు 'ద' కింద శ్రుతిలో వాయించావు తెలుసా ?" అని మందలించాడు.)

ఇది జరిగిన ఎన్నో వారాల తర్వాత సినాత్రా ఒక పెద్ద గొడవలో చిక్కుకున్నాడు. విమానంలో ఆస్ట్రేలియాకి తన సంగీతబృందంతో బయలుదేరబోతూ, వారిలో కొందరికి మంచి 'ఎకామడేషన్' ఇవ్వలేదని ప్రయాణం మానుకున్నాడు.

అతని దయామయ స్వభావం అటువంటిది. నైట్ క్లబ్బులలో పువ్వులు అమ్మే అమ్మాయి వస్తే, 50 డాలర్లు ఇచ్చి పంపేసేవాడు. పూలగుత్తి నాకు ఇచ్చేసేవాడు.

'శాండ్స్' లోని మొదటిరాత్రి రానే వచ్చింది. పెద్ద విజయం అయిపోయింది అది ఫ్రాంక్‌కి.

ఫ్రాంక్ సినాత్రా అప్పటికి పాట కచేరీలు ఇవ్వటం ఆపి 3 సంవత్సరాలు అయాయి. భయంతో బిగుసుకుపోయాడు. కాని ధైర్యంగా స్టేజిమీదకి వెళ్ళి పాడటం ప్రారంభించాడు. రెండు పాటలు కాగానే ఒక కప్పు, సాసరూ స్టేజి మీదకి వచ్చాయి.

"చైనా టీ తాగుతున్నా" నన్నాడు ఫ్రాంక్. అటీ, నిజానికి సిసలయిన విస్కీ. తాగటం పూర్తి కాగానే నావైపు తిరిగి "గాబీ, ఎలా పాడుతున్నా?" అని కేక వేసి అడిగాడు.

కచేరీ అయిపోయిన తర్వాత ఇద్దరం ఎడారి రోడ్డుమీద కారు షికారు వెళ్ళాము. ఈసారి గాలిని ఓడించామో లేదో గుర్తు లేదు. ఫ్రాంక్ తన పేరు నిలబెట్టుకున్నాడు, ఒకరి సాంగత్యం ఒకరికి ఉంది. అంతే చాలు అనుకున్నాను.

మర్నాడు హాలీవుడ్‌కి వచ్చేశాను. "ఫెంటీ బొమ్మా, చిలంగా నువ్వు నాకు అదృష్టం తెచ్చావు. మళ్ళీ కలుద్దాం" అని సెలవు ఇచ్చాడు ఫ్రాంక్.

(సశేషం)

# తెలుగు ఉగాదికి తెలుగు భాషా సమితి శుభాకాంక్షలు శుభవార్త




## విజ్ఞాన సర్వస్వము

**16 సంపుటాల్లో 10 వెలువడ్డాయి**

1. చరిత్ర - రాజనీతి
2. భౌతిక, రాసాయనిక శాస్త్రములు
3. తెలుగు సంస్కృతి - I
4. తెలుగు సంస్కృతి - II
5. అర్థ, వాణిజ్య, భూగోళ శాస్త్రములు
6. విశ్వసాహితి
7. దర్శనములు, మతములు
8. వ్యవసాయ, పశుపాలన, అటవి శాస్త్రములు
9. గణిత, ఖగోళ శాస్త్రములు
10. సాంఘిక శాస్త్రములు

### మహాజనానికి మనవి

తెలుగుదేశం చిరకాలం నుంచి ఎదురు చూస్తున్న ఈ విజ్ఞాన సర్వస్వ సంపుటాలను జ్ఞాన పిపాసువు లందరి దగ్గరకూ, గ్రంథాలయాలకూ చేర్చడానికై సమర్పిస్తున్న ఈ సదుపాయాలకు మీరు హర్షిస్తారనీ, మా కృషిని ఆదరిస్తారనీ, మీ మిత్రులకూ సిఫార్సు చేస్తారనీ ఆశిస్తున్నాము.

ఇట్లు
**తెలుగు భాషా సమితి**

**ముందుకు ముందే సరుకు తీసుకోండి**
**డబ్బు తర్వాత**
**తాపీగా ఇవ్వండి**

**తెలుగు ఉగాదికి దివ్యమైన సదుపాయం**
**రూ. 50 బోణితో రూ. 350 సరుకు**

మొత్తం రూ. 350 లూ ముందుగానే కట్టనక్కరలేదు *
ముందర రూ. 50 మాత్రం కట్టి, మిగతా మొత్తం నెలనెలా
రూ. 25 చొప్పున 12 వంతులుగా ఏడాదిలోగా కడితే సరి *
అడ్వాన్సు రూ. 50 లూ అందగానే ప్యాకింగు
- రవాణా - సాదరుఖాతాల క్రింద మీకు పైసా కూడ
ఖర్చు తగలకుండా పది సంపుటాలూ మీకు చేరతాయి



ఉగాదికి ఇటూ, అటు నెల రోజుల్లోనూ అడ్వాన్సు పంపి
రిజిస్టరు చేసుకొనే వారికి మరొక అద్భుత బహుమానం
సరస్వతీ పీఠం పేటిక [బుక్ కేస్]

**కూపను పూర్తిచేసి ఈ దిగువ చిరునామాకు పంపండి**

- - - - - - - - - - - - - - - - - - - - - - - -

విజ్ఞాన సర్వస్వ సంపుటాలను అందరికీ అందించటానికి
సమితి తలపెట్టిన పథకం పూర్తి వివరాలు నాకు వెంటనే పంపండి.

పేరు ______________________

చిరునామా ______________________

______________________

**TELUGU BHASHA SAMITI** 71 UNIVERSITY BUILDINGS MADRAS-5

# మద్రాసులో జర్మన్ బాలే, రడ్డిగోర్ ప్రదర్శనలు

గ్యేటేయిన్‌స్టిట్యూట్‌వారు అన్నామలై మందిరంలో జర్మన్ బాలే ఏర్పాటుచేశారు. ఇంతకుముందుసంవత్సరాలలో చూసిన విశ్వ ప్రఖ్యాత ఫ్రెంచి, రష్యన్ బాలే ప్రదర్శనలకు యిదేమాత్రం తీసిపోదు. రష్యన్ పద్ధతిలో శారీరక విన్యాసానికి (అక్రోబాటిక్స్) ఫ్రెంచి పద్ధతిలో లావణ్య లాస్యానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు. జర్మన్ బాలేలో రెంటికి సమానమైన ప్రాముఖ్యత యివ్వబడింది. వీరు ప్రదర్శించిన యేడు నృత్యాలలో ఒకె ఒకటి, రోమియో జూలియట్, అంత సంతృప్తికరంగాలేదు. మిగిలినవన్నీ శాస్త్రీయ నృత్యానికి చక్కని ఉదాహరణలు. 'యుద్ధం' అనే నృత్యం, కాన్‌స్టారిన్జ్ వెర్నో, విన్‌ఫ్రెడ్ క్రిష్ డేసినది, సంభ్రమాశ్చర్యాలను కలిగించింది. అగ్ని శిఖలవలె చెంగుచెంగున ఎగురుతున్న న్యాట్యకారులు భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని మరచి పోయారనే భ్రాంతిని కలిగించింది. 'డాన్ క్విక్‌సెట్' అనే శృంగార హాస్య యుగళ నృత్యం ప్రేక్షకులను విశేషంగా అలరించిన నృత్యాలలో మరొకటి. వడిగా గిర గిరా తిరుగుతూ (పిరూయెట్) హఠాత్తుగా స్తంభించిపోవటం చ్వవట్ల వర్షం భళ్లున కురవటం యీ నృత్యంలో పరిపాటయిపోయింది. "కాంటాక్ట్స్" అనే నృత్యం 'ఎలక్ట్రానిక్' సంగీతానికి చేయబడింది. ఎలక్ట్రానిక్ సంగీతం వాయిద్యోద్భవమైన నాద సమన్వితంకాదు. విద్యుచ్ఛక్తి మూలకంగా ఉత్పన్నమయే శబ్దాలను (రేడియోలో పరపర, కరకర అని వినిపిస్తాయే అటువంటివి) ఒకవిధమైన వరసలో అమర్చి, దానికి పియానో, డ్రమ్స్‌ని జోడిస్తారు. దీనికి నృత్య దర్శకత్వం వహించిన ఉల్ఫ్‌గాంగ్ లీస్టర్ విలక్షణ ప్రతిభ యింతా అంతా కాదు. కళ్లెదుట నృత్యం చేస్తున్న ఆడ మగ జంటను చూస్తున్నా అవి యేదో యంత్రపు అంతర్భాగాలని అనిపించేటంత నేర్పుతో యీ నృత్యం సంఘటించారు. తెరపడిన తరువాత రెండు నిమిషాలకుగాని నిశ్చేష్టులైన చూపరులు కరతాళధ్వనులతో తమ మోదాన్ని, ఆమోదాన్ని తెల్పటానికి కోలుకోలేదు. ఆఖరిది 'ఆఫ్టర్ డారుంగ్ జుమ్ టాన్జ్' అంటే నృత్యానికి ఆహ్వానము. తక్కినవన్నీ యిద్దరిద్దరు చేసినవి. ఇది మాత్రం అర్గురూ కలిసిచేసినది. ఇటునుంచి లటూ, అటునుంచియిటూ ప్రవహిస్తున్న ఇంద్రధనుర్వర్ణాలలాగ లేత రంగుల దుస్తులు ధరించిన నాట్యకారులు కనువిందు కలిగించారు. సౌందర్యమయమైన యీముగ్గురు సుందరీమణుల ముగ్ధ చిసుందరాకారుల శరీరాలు సృష్టిలో అత్యంత మనోహరములని చెప్పడం అతిశయోక్తి కానే కాదు. వాటిలో మలచబడిన యక్షిణులకున్న అవయవాల పొందిక స్త్రీలలోనూ, మగసిరి చిందించు గివిరాజసం మృగమధ్యులైన పురుషులలోనూ గోచరించి శారీరక సౌందర్యం అంటే యిదే సుమా అనిపించింది.

ఈపాశ్చాత్య కళా స్వరూప ప్రదర్శనలలో మరొకటి ఎమ్మెమ్మెవారు సమర్పించిన సంగీత రూపకం "రడ్డిగోర్" గిల్బర్ట్ —సల్లివన్— అనే ప్రఖ్యాతాంగ్ల సంగీత సాహిత్యకారులు పంతొమ్మిదవశతాబ్దాంలో సృష్టించిన సంగీత రూపకమిది. సంగీత రూపకాలు మనకూ ఉన్నవికాని అవి "నౌకా చరిత్రము", "ప్రహ్లాద విజయము" వంటి శాస్త్రీయ కర్ణాట రాగాధారాలు. ఈ "రడ్డిగోర్" అటువంటిదికాదు. "లైట్ ఓపరా" అంటారు. సంగీతం లలితంగానే ఉంటుంది.

దీని కథ మన జానపద చిత్రాల కథలకు దగ్గరగా, తర్కానికి, వివేకానికీ దూరంగా, హాస్య శృంగార రసాలకు, భిన్న పాత్రల లాసాలకు ఆటపట్టై అలరిస్తుంది. పిచ్చిదానిగా, ఆ తరువాత పరధ్యానపు పడతిగా మార్జరి గ్రీన్ చక్కగా నటించింది.పాడింది. నావికుని వేషం వేసిన జార్జి సుబ్రమణ్యం రూపంలో అందంగా ఉండటంలోనే తన పాత్ర పోషణను సరిపెట్టాడు విలన్ వేషం ధరించిన తంటి కగుంటి వనం క్రౌర్యం చూపిస్తూ హాస్యరసాన్ని పోషించాడు. కష్టతరమైన దీన్ని. లక్ష్మీన నటీనటులు తమ తమ పాత్రలకు న్యాయం చేశా...

"ఏదేమైనా కర్తవ్యం ముఖ్యం" అంటూ అడ్డుపుల్లలువేసి తన ప్రేమ ఫలింపచేసుకొనటానికి నావికుడు ప్రయత్నించినప్పటి పాట్లు, 'అయ్యో అయ్యో, పాపం అబ్బాయి, అయ్యోపాపం అమ్మాయి-'అని అన్యాపదేశంగా ప్రేయసీప్రియులు తమ భావాలను బయటపెట్టాలనిచూసినప్పటిఫోటో సరదాగా, హుషారుగా ఉన్నాయి. హాండల్ మాన్స్యెల్ సంగీత నిర్వహణ పటిష్టంగా ఉన్నది.

—వి. ఎ. కె. రంగారావు



పశ్చిమ జర్మనీ యువచిత్రకారుడు జోసెఫ్ అబాల్ క్లైవ్‌క్లైటర్ సహాయంతో వేసిన ఎలిజబెత్‌రాణి చిత్రం.




# యవనిక

రూప

"ఎవరూ వెంకటరామయ్యా రా. రా చాలా కాలానికి దర్శన భాగ్యం కలిగింది."—అంటూ చిరునవ్వుతో లోనికి ఆహ్వానించారు పరంధామ శాస్త్రిగారు.

"అంతా కులాసాగున్నారా ఏరీ ఎవ్వరూ కనిపించరేం"—అంటూ లోనికి చూడసాగేరు వెంకట్రామయ్యగారు.

"సాయంకాలపు వేళ కదూ చిన్నబాబు ప్రకాశమేమో బయట ఆడుకుంటూన్నట్లుంది. జ్యోత్స్నమో ఎదురింటావిడతో బజా కెళ్ళింది. శకుంతల లోపల ఉన్నట్లుంది."

"అమ్మా శకుంతలా ఇలా రామ్మా"—అంటూ కేక వేశారు పరంధామ శాస్త్రిగారు.

'వస్తున్నా మావయ్యా' అంటూ లోపుండి జవాబు వినిపించింది.

'అన్నట్లు మన అబ్బాయేడోయ్ ?' అంటూ ప్రశ్నించారు వెంకటరామయ్యగారు.

'ఏదీ. ఇంకా ఆరుగంటలే కదా అయింది. కాలేజీలో పనీ అదీ చూసుకుని మెల్లిగా రావద్దూ. రోజూ ఏడింటికి గానీ ఇంటికి రాడు. ఏంటో . నే మండగానే వాడు కష్టపడటం నా కిష్టం లేకున్నా, వాడు వినడం లేదు వెంకూ.'

మాట ముగించకముందే 'పిలిచారా మావయ్యా' అంటూ వో స్త్రీ ప్రవేశించింది.

'చూడమ్మా శకుంతలా. ఇలా రామ్మా. ఈయన వెంకటరామయ్యగారని, నా చిన్ననాటి స్నేహితుడు. అత్తయ్య ఏం చేస్తోంది? ఎక్కడుందో, ఒక్కమారు పిలువమ్మా'—అన్నారు శాస్త్రిగారు.

'నమస్కారమండి'—అంది శకుంతల వెంకట్రామయ్యగారి వైపు తిరిగి.

'ఇప్పుడే వచ్చేస్తా మావయ్యా' అంటు లోని కెళ్ళింది.

"ఈ అమ్మాయి నా కోడలు వెంకూ! మాణిక్యంలాంటి పిల్లనుకో. గొప్ప చెప్పుకోటం కాదుగానీ, ఈ అమ్మాయి మనబ్బాయికి దొరకటం మా అదృష్టమనుకో"—అంటూ చిన్నగా నవ్వేరు.

"నువ్వు చాల అదృష్టవంతుడివోయ్ పరం. రత్నంలాంటి కొడుకును, మాణిక్యంలాంటి కోడలినీ పొందావు. అందరికీ అలాంటి స్వర్గం లభిస్తే ...."

"ఆఁ .... ఏంటో అంతా వాడి లీల కానీ, మనం చేసేదేముంది వెంకూ ?"

"అని మన మనుకుంటూంటాం పరం. దైవమనే వాడొకడున్నా, అంతా వాని మహిమే నని కూర్చుంటే ఎలా ? మనం చేసే ప్రతి పనికీ దైవమే బాధ్యు డెలా గవుతాడు ? మన యత్నం గూడ కొంత ఉండాలికదా పరం" అంటూ శాస్త్రిగారి వైపు చూచారు వెంకటరామయ్య.

"అన్నట్లు మన ప్రభాకరం ఏదయినా ఉద్యోగం చేస్తున్నాడా"—అంటూ సంభాషణ మార్చారు పరంధామశాస్త్రిగారు.

"ఆఁ .... ఏదో ఉద్యోగం వెలగబెడుతున్నాడు. మొన్న క్రొత్తగా స్టార్టు చేసిన గవర్నమెంటు కాలేజీలో అసిస్టెంటు లెక్చరరు ...."

"అయితే ఇంకేమోయ్? ఇద్దరూ ఆచేతో ఈచేతా ఆర్జిస్తున్నారన్నమాట. చాల సంతోషమోయ్. అతనూ ప్రయోజకుడయాడు గదా ..."

"ఇంకా ఏం ఆర్జన పరం. నా అవసరం తీరిపోయింది ప్రభుత్వానికి. నేను వాక్కి

చేసినన్నినాళ్ళు పదింటి నుండి, ఏడు గంటల దాకా చేయించుకున్నారు. ఇక నీ సేవ చాలు నాయనా, నువ్వు చేయలేవు ఈ వూడిగం. ఇంట్లో కూర్చో. నెలనెలా యింత డబ్బిస్తాం' అన్నారు పది రోజుల క్రిందట. మొన్నటిదాకా, ఎంతో సమర్థతతో పని చేసినవాడు, అంతులేని కృషి సలిపినవాడు అని తెగ పొగడినవారికి ఇప్పుడు నాలో అసమర్థత తెరమీద బొమ్మలాగ కనిపిస్తోందా పరం?''

''మావయ్యా చెప్పడం మరచిపోయాను అత్తయ్య ఎదురింటి పార్వతమ్మగారితో పురాణానికి వెళ్ళింది.''—అంటూ కాఫీ ప్లేటుతో ప్రవేశించింది శకుంతల.

''కాఫీ తీసుకోండి పెదనాన్నగారూ!'' అంటూ కాఫీ అందించింది శకుంతల.

''ఇప్పు డెందుకమ్మా నాకోసం శ్రమపడ్డావు'' అంటూ కాఫీ అందుకున్నారు వెంకట్రామయ్యగారు.

''ఈ కాస్తలో శ్రమేముందిలెండి పెదనాన్నగారూ!''—అంటూ లోనికెళ్ళింది.

''పిల్లలేరమ్మా, ఒక్కమారు రిలా పిలుస్తావా!'' అన్నారు పరంధామశాస్త్రి.

''బయట ఆడుకుంటూన్నట్టుంది. పిలుస్తాను మావయ్యా'' అంటూ వెళ్ళింది శకుంతల.

''మనం కాసేపలా వెళ్ళి వద్దామా పరం''—అనడిగారు వెంకటరామయ్య.

'తాతయ్యకు నమస్కారం చేయి బాబూ' —అంది శకుంతల, అయిదేళ్ళ బాబును తీసుకుని వస్తూ. ''జ్యోత్స్న లేదు మావయ్యా''

'నమస్కాలమండీ'— అన్నాడు బాబు, ముద్దుగా. చేతులు జోడిస్తూ.

'నమస్కాలమండీ'— అంటూ బాబును అనుకరిస్తూ, 'నీపేరేంటి బాబూ?' అని అడిగారు వెంకట్రామయ్యగారు.

'ప్రకాశం' అన్నాడు బాబు.

'ఏం చదువుతున్నావు బాబూ ?'

'ఫోర్త్ క్లాస్' అన్నాడు, ఇంగ్లీషులో బాగా మాట్లాడగలనన్న ధీమాతో.

'బాబూ ఇంట్లోనే ఉండమ్మా అమ్మకి తోడుగా!' అన్నారు బాబుతో శాస్త్రిగారు.

'సరే.' అంటూ తలూపాడు బాబు.

'చూడమ్మా. నే నలా వెళ్ళి ఇప్పుడే వచ్చేస్తాను. ఒంటరిగా ఉండగలవా ?' అనడిగారు.

'దానికేం! వెళ్ళిరండి మామయ్యా' అంది శకుంతల బాబును దగ్గరకు తీసుకుంటూ.

ఇద్దరు మిత్రులూ గుమ్మం దిగి జనసమ్మూహంతో కలిశారు.

*           *           *

''మనుష్యులు చూపెటంతటి కృతఘ్నత మరే జంతువు కూడా చూపదేమో పరం'' అంటూ సంభాషణ ప్రారంభించాడు వెంకట్రామయ్య.

'అదేంటోయ్. అలా అంటున్నావు !' అన్నారు పరంధామశాస్త్రి.

'అంతేనోయ్ పరం. మనుషులంతే.'

'హీనజాతికి చెందిన దనుకునే కుక్కే నయం. దానికి మనం సంపాదించిన దాన్తో కడుపునిండా తిండిపెట్టినరిగా పోషిస్తామా? అది మనకెంతో నమ్మకంగా మన ఋణం తీర్చుకుంటుంది. మన ఇల్లు, అది జీవించినంతకాలం కాచుకుని పడిఉంటుంది. కానీ యీ మనుషులున్నారు చూచావ్ ? వీళ్ళట్టి స్వార్థపరులోయ్. కుక్కల్లాగే వీళ్ళూ మన చుట్టూ చేరతారు. కానీ అది మనం సంపాదించి వాళ్ళకి పెట్టినంతవరకే. మనం పెట్టినంతకాలం మన కెంతో హితైషులమల్లాగా మెలగుతారు. మనమేమీ యివ్వలేని స్థితిలో ఎంతో కించపరుస్తారు. వీళ్ళన్నంతకాలం కప్పల్లాగ. ఎంతయినా పంచదార ఉన్నంతవరకేనోయ్, ఈ చీమలు' అంటూ ఒక క్షణ మాగేరు వెంకట్రామయ్యగారు.

వోపిగ్గా వింటూ ముందుకు సాగుతున్నారు పరంధామశాస్త్రిగారు.

''రిటయురయి పది రోజులేనా అయింది వెంకూ ?''

''అవును పరం. ఈ పది రోజుల్లోనే అనుభవించ గలిగినంత నరకయాతన అనుభవించాను. ఇంట్లో ఒక క్షణం కూడ ఉండ లేకపోయాననుకో. తిరుపతి ప్రయాణం పెట్టుకుని అక్కడక్కడ మజిలీలు చేసుకుంటున్నా. ఎక్కడయినా ప్రశాంతి లభిస్తుందేమోనని.''

''అయితే నువ్విప్పుడు తిరుపతి ప్రయాణంపైన ఇక్కడ బస చేశావన్నమాట.''

''అవునోయ్. చిననాటి మిత్రుణ్ణి చూసి పోదామనిపించింది. ఈపూట ఇక్కడ ఆగేనోయ్'' అంటూ సమాధాన మిచ్చారు వెంకట్రామయ్యగారు.

''అబ్బాయి ఏదో ఉద్యోగం చేస్తున్నట్టు చెప్పావు. ఎన్నేళ్లబట్టి ఏంటి ?''

''ఆ .... ఎన్నో ఏళ్ళెక్కడిదోయ్. మొన్న నేను రిటయు రయ్యానా ? సరిగ్గా అదే రోజునుండి వాడూ ఉద్యోగంలో చేరాడు.''

''అరె ! గమ్మత్తుగా ఉందే వెంకూ తండ్రి ఉద్యోగానికి స్వస్తి చెప్పడం, తనయుడు ఉద్యోగంలో చేరడం ఒకేరోజు జరగడం ఆశ్చర్యంగా లేదూ?''— అంటూ చకితుడయారు పరంధామశాస్త్రిగారు.

కొద్ది క్షణాలు మవునంగా గడిపేరు.

''కాసేపు ఈ పార్కులో కూచుందాం''— అంటూ లోనికి దారితీశారు వెంకట్రామయ్య.

అప్పుడప్పుడే రాత్రి దీపాలతో అలంకరించుకుంటూంది.

''ఏమనుకోకపోతే ఒక్క విషయం ప్రశ్నిసా వెంకూ.'' అంటూ, లాన్సులో కూచుంటూ సంశయిస్తూ ప్రశ్నించారు పరంధామశాస్త్రిగారు.

''మనలో మనకు సంశయా లేమిటి పరం నిస్సంకోచంగా అడుగు.''

''నువ్వు రిటయురయిం తరువాత మీ యింట్లో పరిస్థితులంత అనుకూలంగా ఉన్నట్టు లేదు నీ మాటలు బట్టి. నావూహ సరియైనదేనా ?'' అంటూ ఆయనవైపు చూచారు శాస్త్రిగారు.

''దాంట్లో అబద్ధ మేముంది పరం? ఇంతవరకూ నే చెప్పినదంతా అదేగా ! నేను సంపాదించినంతవరకు పంచదార కోసం చీమల్లా, అందరూ నా చుట్టూ చేరారు. నన్ను పొగడ్తలతో అభిమానంతో ఉబ్బి తబ్బిబ్బులు చేశారు. మొన్న పది రోజుల క్రితం నే రిటయ రయ్యానా ? ఇంట్లోవారు అంతకుముందు చూపిన ఆదరం అభిమానం ఏమయ్యాయో మరి. ఆర్జన లేదుకదా అని జంతువుకన్నా హీనంగా చూశారు నన్ను.''

''అదేంటి వెంకూ. ఇంట్లోవాళ్ళు అంత కఠినంగా మారేరా ? నమ్మదగ్గ విషయంగా లేదు వెంకూ.'' అన్నారు పరంధామశాస్త్రిగారు.

''ఎలా నమ్మగలవు పరం? నాకే ఆ మార్పు అర్థంకాలేదు. ఈ మనుషుల కృతఘ్నతకు పరవారూ, పరవారు అన్న భేదంలేదు పరం. మిత్రుడు, బంధువు, కన్నకొడుకైనా, కట్టుకున్న భార్యయినా, గడునుడిగినవారిపై మమకారం పోగొట్టుకుంటారని ప్రత్యక్షంగా అనుభవించాను పరం....''

పరంధామశాస్త్రిగారు తదేకంగా మిత్రుని ముఖ కవళికలు పరిశీలించసాగేరు.

''నీకు ఆశ్చర్య మేసినట్లే నాకూ ఆశ్చర్యమేసిందీ దానాడు.''

''కొడుకు ఉద్యోగంలో చేరడం, నేను

ఉద్యోగం నుండి విశ్రాంతి తీసుకోవడం ఒకే నాడు జరిగాయి గదూ. నేనింకా ఆర్జించి కుటుంబాన్ని పోషించలేక పోతున్నానే అన్న దిగులు లోకవైపు వేధిస్తున్నా, వాడు ఒక బాధ్యతను నెత్తిన వేసుకొని కుటుంబాన్ని పోషించగలిగినంతటి వాడయ్యాడు కదా అని మహదానందం పొందాను పరం.

"కానీ ఆ ఆనందం రెండు రోజులు కూడా నిలువలేకపోయింది. క్షణక్షణం ఉద్యోగం లేనివాడవని, ఇక నాకు ఎటువంటి బాధ్యత లేదనీ, ప్రతివారూ దెప్పి పొడవటం, కించపరచడం సహించలేకపోయాను పరం.

"మామూలుగా రిటయరయ్యాక కూడా స్నానం, జపం జరగుతుం దనుకున్నాను. పెందలాడే స్నానం చేశాను. జపం చేసుకుంటున్న నాకు, 'ఏడున్నర యిపోయింది. నా స్నానానికి నీళ్లు కాగలేదు. ఎలాగనుకున్నారు ?' అంటూ భార్యపై కేకలేస్తున్న ప్రభాకరం మాటలు వినిపించాయి.

'ఆఫీసు కెళ్లవలసిన వాళ్లింట్లో ఉండగా ఉద్యోగం, సద్యోగం చేయ నవసరంలేనివా రందరూ కాగిన నీళ్లన్నీ పోసుకుంటే మీ కెలా మిగుల్తాయండి వేణ్ణీళ్లు' అంటూ కోడలు సమర్థిస్తూంది పరం.

"ఆ మాటలు నీకు వినదగ్గవిగా ఉన్నాయా భోజనాల దగ్గర అదే గొడవ. అన్ని రోజుల అలవాటు గదా. మామూలు వేళకు భోజనానికెళ్తే "మీకేం తొందరొచ్చిందండీ ? ఆఫీసుకెళ్ల నక్కరలేదుగా. కానేపయ్యాక తిందాం లెండి"—అంటూ భార్య నాకు చెప్పటం, నన్ను ఉద్యోగం సద్యోగం లేని అవారా వెధవగా చూడడం సబబేనా పరం?

"చిన్నపిల్లలు,ఆఖరుకు నౌఖరు మనుషులు గూడా నేనో ఆర్జనలేని విగ్రహాన్నను కుంటూ అనుక్షణం దెప్పి పొడుపులతో కించపరుస్తూంటే, ఆవూర్లో ఇక తలెత్తుక తిరుగలే ననిపించింది. ఎక్కడయినా ప్రశాంతి దొరుకుతుందేమోనని బయలుదేరాను. ఈ పదిరోజుల్లో చాల అనుభవం సంపాదించాను పరం. ఇంతకీ ఇలాంటివారు దొరకడం నా అదృష్టం." అంటూ నిరాశగా నవ్వేరు వెంకటరామయ్యగారు.

"నీకు కలిగిన యీ దుస్థితికి విచారిస్తున్నాను వెంకూ. ఈ విషయంలో నే నెలాంటి సహాయం చేయగలనో చెప్పు. తప్పకుండా చేస్తాను వెంకూ" అంటూ వెంకట్రామయ్యగారి వైపు చూచారు పరంధామశాస్త్రిగారు.

"చేయగలిగిందేమీ లేదు పరం. నే నిలా నా అదృష్టానికి సంతోషించవలసిందే. .... ఆఁ.... ఏంటో చెప్పి నిన్ను బాధ పెట్టున్నట్టుంది నేను. క్షమించు పరం. ఇక వెళ్దామా ? నే నలా హోటలువైపు వెళ్లి, రాత్రి ట్రైనుకు బయల్దేరుతాను" అంటూ లేవబోయారు వెంకట్రామయ్యగారు.

"అదేంటి? ఇన్ని రోజులకు కలిసిన చిన్ననాటి మిత్రుడవు. మా ఇంట్లో ఆతిథ్యం స్వీకరించకుండానే వెళ్లడమా? శకుంతల వూరుకోదు. తప్పదు. ఈరోజు మాఇంట్లో ఉండితీరాల్సిందే. అసలు నే నున్నానని తెలిసీ, హోటల్లోకి దిగిన నిన్నేమనాలో తెలీడం లేదు."

"లేదోయ్. అనవసరంగా శ్రమపెట్టడం ఎందుకని ఇంట్లో దిగలేదు...."

"అదంతా తెలియదు. ముందు ఇంటి కెళ్దాం. తర్వాత సంగతి ఆలోచించవచ్చులే" —అంటూ పరంధామశాస్త్రిగారు బయలుదేరారు.

దారివెంబడి మాటలు కరువయ్యాయి.

"నా గమ్యం కూడ చేరువైంది వెంకూ. ఇంక అయిదు రోజుల్లో నేనూ రిటయరవబోతున్నాను'—అంటూ వెంకట్రామయ్య వైపు చూచారు శాస్త్రిగారు.

"అనకూడదు గానీ, నీకూ మొదలవుతున్నాయన్నమాట మంచిరోజులు."

"అలా అనుకోటం పొరపాటు వెంకూ. మనుషులందరూ ఒకే విధంగా ఉండరుకదా. నా అదృష్టమెలా ఉంటుందో మరి. ఏదీ మన చేతుల్లో లేదు. కానీ మనిషెప్పుడూ సుఖాన్నీ, మంచినీ కోరుకోటం సహజం. నేనూ అలానే, మంచిరోజుల్నే ఆశిస్తాను. అంత కన్నా ఏం చేయుగలను ?"

"క్షమించు పరం. ఏమీ అనుకోకేం."

"ఆ.... దానిదేముందిలే వెంకూ ..."

అవీ యివీ మాటాడుకుంటూ ఇల్లు చేరారు ఇద్దరూ.

హాల్లో కూర్చున్న వ్యక్తి వీరిని చూచి లేచి నిలుచున్నాడు.

"ఇతనే మా అబ్బాయి చక్రధరం. గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీలో సైకాలజీ లెక్చరరుగా పనిచేస్తున్నాడు. అబ్బాయ్. ఈయన నా బాల్యమిత్రుడు వెంకట్రామయ్యగారు బాబూ" అంటూ పరిచయం చేశారు పరంధామశాస్త్రిగారు ఇరువురినీ.

"నమస్కారమండీ." అన్నాడు చక్రధరం భుజంపైన ఉన్న బాబును దింపుతూ.

"తాతయ్యా, ఈ తాతయ్యా మళ్ళీ వచ్చారేం తాతయ్యా " అంటూ పరంధామశాస్త్రిగారి దగ్గరకు వచ్చాడు వాళ్ల చిన్న బాబు ప్రకాశం.

"ఆయన రానన్నారు బాబూ. నేనే బలవంతంమీద తీసుకుని వచ్చాను" అంటూ నవ్వేరు శాస్త్రిగారు.

"ఏం బాబూ. మీ ఇంటికి నేను రాకూడదా ?" అంటూ బాబుని ప్రశ్నించేరు వెంకట్రామయ్యగారు.

"రావచ్చు" అంటూ ముద్దుగా జవాబిచ్చాడు.

"నా బాబు కదే. ఎంత మంచివాడివి బాబూ" అంటూ ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నారు ప్రకాశాన్ని.

అక్కడున్న ఎనిమిదేళ్ల పిల్లకు ఇదేమీ అర్థంకాలేదు. అసలు ఆ వచ్చిన వ్యక్తెవరో, ఎందుకు వచ్చాడో, ఆయనతో ప్రకాశానికి పరిచయ మెలా కలిగిందో తెలియక బొమ్మలా నిలుచుని చూస్తూంది.

"రామ్మా జోత్స్నా, రా!" అంటూ వెంకట్రామయ్యగారు పిలిచేసరికి ఇంకాస్త ఆశ్చర్యపడింది. తనపేరు ఆయన కెలా తెలుసా అని. మెల్లిగా దగ్గరకు వచ్చింది.

"ఏం చదువుతున్నావమ్మా ?" అంటూ అడిగేరు.

"నాలుగోక్లాస్" అంది.

"అమ్మో ! అప్పుడే నాలుగో క్లాసా? నేన్నమ్మను" అనేసరికి,

"వూహుఁ. నిజంగా నే న్నాలుగోక్లాసే." అంది తాను నాలుగోక్లాసే చదువుతున్నానీ, అబద్ధం కాదనీ మాటల్లోనో తెలుపుతూ.

"అమ్మా శకుంతలా"—అంటూ కేకేశారు శాస్త్రిగారు.

"వస్తున్నా మావయ్యా"—అంటూ లోనుండి వచ్చింది శకుంతల.

"చూడమ్మా. ఈయన వెళ్లిపోతానంటున్నారు. ఆ విషయం నీకు వదిలేశాను" అంటూ నవ్వేరు పరంధామశాస్త్రిగారు.

"అదేంటండీ పెదనాన్నగారూ. అప్పుడే వెళ్లడమేంటి ? వచ్చి ఇంకా ఘంటసేపయినా కాలేదు. బాల్యమిత్రుణ్ణి కలుసుకుని ఒక్క నిముషంలో వెళ్తే ఎలా! రాత్రికి ఉండి రేపు ఉదయాన్నే వెళ్లచ్చులెండి" అంది శకుంతల.

"అగేంటండీ మావయ్యగారూ అప్పుడే వెళ్లడమేంటి. రేపు ఉదయాన్నే వెళ్లచ్చు లెండి" అంటూ చక్రధరం కోరేడు.

"తాతయ్యా, రాత్రికి కథలు చెప్పి రేపొద్దున పో తాతయ్యా" అన్నాడు ప్రకాశం ముద్దుగా.

"తాతయ్య రాత్రికి ఇక్కడే ఉంటాల్లేవే అక్కయ్యా. ఎంచక్కా మనకు కథలు, అవీ చెప్తాల్లే" అంటూ ప్రకాశం గెంతులేసే సరికి వెంకట్రామయ్యగారు హృదయ పూర్వకంగా ఆనందించారు. "సరే. మీకోసమైనా ఉంటా" నంటూ ఒప్పుకున్నారు.

* * *

వెంకట్రామయ్యగారు వెళ్లిపోయేముందు శాస్త్రిగారు, "వెంకూ, ఒకటి గుర్తుంచుకో. అందరు మనుషులూ ఒక్కలాగు ఉండరు ఎప్పుడూ. పూసరవెల్లే కాదు, మానవులూ పరిస్థితులకు అనుకూలంగా రంగులు మార్చుకుంటారు. వాటిని గురించి బాధపడి ప్రయోజనంలేదు వెంకూ. నీకు ఇక్కడ ప్రశాంతంగా ఉంటుందని తోస్తే ఇక్కడికే రా వెంకూ. ఎన్నడూ సంశయించకు."— అంటూ సాగనంపేరు.

* * *

తరువాతి దినం.

రాత్రి భోజనాల తరువాత తన గదిలో కొత్తగా వచ్చిన వారపత్రిక ఏదో కనిపించింది. 'దీపావళి ప్రత్యేక సంచిక.' తిరగేశాక, కథ ఏదో చదవడం మొదలుపెట్టారు శాస్త్రిగారు.

"అరే అచ్చు వెంకుకు సంబంధించిన సంఘటనలతో కూడిందేనే ఈ కథ. అతనే వ్రాసిగానీ పంపించాడా?" అనుకొంటూ రచయిత పేరు చూచారు. కాదు.

"కానీ అచ్చు అతనిలాంటి వో పెద్ద మనిషికి, సరిగ్గా అతనికి జరిగిన భంగపాటే జరిగింది. వెంకుది, ఈ కథానాయకునిది ఒకే పరిస్థితి. ఇద్దరూ ఒకేవిధమయిన బాధకు లోనయ్యారు."

వరంధామశాస్త్రిగారి ఆలోచనలన్నీ ఆ కథానాయకుని మీదకూ, బాల్యమిత్రుడు వెంకట్రామయ్యమీదకు మరలాయి. ఏవేవో ఆలోచనలు రేకెత్తాయి.

'లోకంలో మానవు లందరు ఒకేలా ప్రవర్తిస్తారా?' అన్న ప్రశ్నకు సమాధానంగా ఒకవైపు 'లేదు. అందరూ ఎన్నటికీ ఒకేలాగ ఉండరు. అసంభవం' అంటూ వినిపించింది. కానీ మరొకవైపు,

"కాదు. అందరూ అంటే. మానవులంతా

ఒకే జాతి. అందరూ పంచదార కోసం చీమలు ప్రవర్తించినట్లు ప్రవర్తిస్తారు. కృతఘ్నతకు అందరు భాగస్తులే. అంతే'' అంటూ వినిపిస్తోంది.

పడుకున్నారన్నమాటే కానీ పరంధామ శాస్త్రిగారికి నిద్రపట్టడంలేదు.

'ఈ రెండు పూటలు గడిస్తే నేనూ అలా కించపరుపబడవలసిందేనా ?' అన్న సందేహము ఒకవైపు తలెత్తుతూ ఉంది.

''ఒద్దు భగవాన్. వద్దు. ఆ పరిస్థితి తీసుకురాకు'' అంటూ కోరేడు.

మామూలుగా దినచర్య ప్రారంభమయింది. భోజనం దగ్గర కూర్చున్నారు శాస్త్రిగారు. ''అదేంటండీ, మీరొచ్చి కూర్చున్నారు. వాడికి ఆఫీసుకు వేళవుతోందంటూంటే. మీకేమన్నా ఆఫీసా పాడా !'' అంటూంది పార్వతమ్మగారు.

''అయ్యగోరూ ! ఈనెల జీత మిప్పించండి దొరా.''

''అప్పలయ్యా ! నీ కెన్నిమాట్లు చెప్పాను. జీతం అయ్యగార్ని అడగొద్దని. ఇంతకు ముందంటే ఇచ్చేవారేమో. ఇప్పుడు ఉద్యోగమా, సద్యోగమా ? ఆయన పించను పుచ్చుకున్నార్రా. తిని తిరిగ్గా కూచోటమే పని'' అంటూంది శకుంతల.

''తాతయ్యా డబ్బులే. బిస్కెట్లు కొనుక్కుంటాను.''

''ఒరేయ్ ప్రకాశం. తాతయ్య దగ్గర డబ్బులెక్కడివిరా ? ఆయన ఉద్యోగం చెయ్యడం లేదుగా. డబ్బు లుండవు. పోయి నాన్న నడుగు'' అంటూంది జ్యోత్స్న.

''ఛీ. ఫోండి. కుక్క వెధవల్లారా. చీమల్లారా. పూసరవిల్లుల్లారా పోండి'' అంటూ చేతిలోని కర్ర విసిరివేశారు శాస్త్రిగారు.

ధభీమని చేతిలోని వారపత్రిక క్రింద పడింది.

''వెధవ కల. ఛీఛీ. పీడ కల. ఎంత భయంకరంగా ఉంది ?''

''అలా జన్మలో జరక్కూడదు వెంకన్నా'' అనుకుంటూ నిద్రపోయారు.

*　　　*　　　*

''ఇక నేను ఉద్యోగం చెయ్యనక్కరలేదు బాబూ. ఈ ఒక్కరోజు ఆఫీసు కెళ్ళాలి. రేపటిన్నుండి ఆ అవసరం లేదు. సంసారమంతా నీ ఒక్క చేతిమీదుగా జరగాలి. ఎలానో ఏమో నా కర్థంకావటంలేదు...''

''మరేం ఫరవాలేదులెండి నాన్నగారూ. ఇన్నేళ్ళుగా విశ్రాంతిలేకుండా శ్రమపడ్డారు. ఇక విశ్రాంతి తీసుకోండి. దీనికి బాధపడాల్సిన అవసర మేముంది నాన్నా?'' అంటూ జవాబిచ్చాడు చక్రధరం.

# యవనిక

అంతటితో ఆ ప్రస్తావన ముగిసింది. పరంధమశాస్త్రిగారు రిటయరయారు. గాలికన్నా వేగంగా ప్రాకిపోయిందీ వార్త వూర్లో.

శాస్త్రిగారు పైపైకి ఎంత గాంభీర్యంగా ఉన్నా, లోన ఏం జరుగుతుందో. అదృష్ట మెలా ఉందో అన్న భయం కలుగకపోలేదు.

రాత్రి చాలాసేపటివరకు నిదురపోలేదు. ఎందుకో మిత్రుడు వెంకట్రామయ్య చెప్పినట్లుగా, ''మనుషులందరు ఒకటేనా?'' అనిపిస్తోంది. ''అందరూ పంచదార కోసం చీమలు, తేనె కోసం ఈగలు లాగ తన సంపాదన కోసం మాత్రమే వస్తారా ?'' అన్న ఆలోచన కూడ వచ్చింది.

*　　　*　　　*

దినచర్య మామూలుగానే మొదలయింది. స్నానంచేసి సంధ్య జపం అన్నీ మామూలుగానే ముగించారు.

రోజూ భోజనం చేసే వేళకు ఆయనా వెళ్ళారు. కొడుక్కూ, భర్తకూ, పిల్లలకూ కంచాలు పెట్టింది పార్వతమ్మ.

''అయ్యో. నే నొచ్చానే. నా కివాళ ఆఫీసు లేదుగా'' అంటూ లేచి పోబోయారు పరంధామశాస్త్రిగారు.

''అదేంటండీ. అలా లేచి పోతారు? నిన్నటి వరకూ మీరు భోజనం చేసే వేళ ఇదేగా దాని కలవాటు పడ్డవారు ఎలా మానుకుంటారు ? కూర్చోండి'' అంటూ బతిమిలాడింది పార్వతమ్మగారు.

ఇంట్లో ఎలాంటి మార్పూ రానందుకు సంతోషించారు శాస్త్రిగారు.

రోజూటిలాగే శకుంతల వక్కపొడి అందించింది.

''ఇంకా ఎందుకమ్మా ? ఇంక నేను ఆఫీసుక్కూడా వెళ్ళనక్కరలేదుగా ?''

''అదేంటి మావయ్యా. ఆఫీసు కెళ్ళనంత మాత్రాన అలవాట్లన్నీ మరచిపోవాలా ?'' అనడిగింది శకుంతల ఆశ్చర్యంతో.

ఒక్క క్షణం చూచి వక్కపొడి అందుకొని పైకి నడచారు పరంధామశాస్త్రిగారు.

''తాతయ్యా, డబ్బు లివ్వరా ?'' అంటూ వచ్చారు పిల్ల లిద్దరూ.

ఆనందంతో వా ళ్ళిద్దరిని ముద్దెట్టుకుని డబ్బులిచ్చి పంపేరు శాస్త్రిగారు.

''నాన్నా, నేను కాలేజీ కెళ్తున్నాను. మీకు ఏమయినా కావాలంటే పట్టుకొస్తాను'' అంటూ వచ్చాడు చక్రధరం.

''నాకేం కావాలి బాబూ. నాకేం అవసరం లేదు. నువ్వెళ్ళు. బాబూ, కాలేజీకి వేళైపోతుందేమో'' అంటూ జవాబిచ్చారు శాస్త్రిగారు.

ఆనాడు పరంధామశాస్త్రిగారు చాల సంతోషించారు.

రోజులు అలానే సాఫీగా గడిచిపోతున్నాయి.

*　　　*　　　*

''మావయ్యా ! కాఫీ.''

. . . . . . .

''మావయ్యా! కాఫీ తెచ్చాను మావయ్యా'' అనీ మళ్ళీ చెప్పేసరికి,

''వూఁ ....'' అంటూ ఇటు తిరిగారు శాస్త్రిగారు మెల్లిగా.

''ఏం మావయ్యా, ఒంట్లో బాగాలేదా?'' అనడిగింది.

''ఆఁ .... ఏం లేదమ్మా. తల నొప్పిగా ఉంది. అదే పోతుందిలే.''

''అదేంటి మావయ్యా ? ఇంత కాలుతూ ఉంటే ఏమీ లేదంటారు. ముందు కాఫీ తీసుకోండి. డాక్టరును పిలిపిస్తాను''— అంది శకుంతల, శాస్త్రిగారి కణతలు ముట్టుకుని చూచి.

క్రిందికి ఒక్క పరుగున వెళ్ళింది, కాఫీ అందిచ్చాక.

''ఏమయిందండీ'' అంటూ పార్వతమ్మగారు గాభరాపడుతూ వచ్చారు.

''అయ్యో, ఇంత మండిపోతుంటే ప్రొద్దున్నుండి చెప్పకపోయారటండీ'' అంటూ కణతలు రాస్తూ కూర్చున్నారు పార్వతమ్మగారు.

''అబ్బ. ఒద్దులేవే. తలనొప్పి ఏమీ కాదు.'' అంటూ వారించపోయారు శాస్త్రిగారు.

ఇంతలో డాక్టరుగారితో సహా వచ్చాడు చక్రధరం.

''ఎందుకు బాబూ! అనవసరంగా శ్రమ పడటం? ఈపూట గడిచాక చూడకపోయారా?'' అన్నారు శాస్త్రిగారు బాధతో, ఒక్కొక్క మాటే.

డాక్టరు పరీక్షించారు. మందులేవో ఇచ్చి వెళారు.

నాలుగు రోజులు గడిచాయి. ఈ నాలుగు రోజులు శాస్త్రిగారికి ఒళ్ళు తెలియని

జ్వరం కాచింది.

* * *

"అమ్మా" అంటూ మూలిగారు శాస్త్రి గారు.

"మావయ్యా. ఏం కావాలి మావయ్యా?" అంటూ దగ్గరకు వచ్చింది శకుంతల.

"మంచినీళ్లు"—అన్నారు నీరసంగా.

మంచినీళ్లు ఒంపి యిచ్చింది.

"మావయ్యా ! కులాసాగా ఉందా మావయ్యా !" అనడిగింది.

"ఫరవాలేదమ్మా" అంటూ నిలుచో బోయారు.

"అయ్యో, అదేంటి మావయ్యా. నిలుచుంటారా ? పడుకోండి మావయ్యా!"

"లేదమ్మా నిలుచోగలను" అంటూ లేచి నిలుచోబోయారు.

"ఒద్దు మావయ్యా ! ఇంకా పథ్యం కూడ తినలేదు. పోనీ తలగడకు ఆనుకుని కూర్చోండి" అంటూ తలగడాలను సర్దింది.

"అమ్మా—ఈరోజు తారీకెంత ?"

"ఇరవై ఐదు మావయ్యా."

"అంటే నేను జబ్బు పడి ఎన్నిరోజు లయింది ?"

"నాలుగు రోజుల నుండి మావయ్యా. ఈదినమే కాస్త మాటాడగలుగుతున్నారు. ఇక కాసేపు విశ్రాంతి తీసుకోండి మావయ్యా" అంటూ కూర్చుంది.

"అయితే ఇన్ని రోజులు నిన్ను కష్ట పెట్టినా తల్లీ ?"

"లేదు మావయ్యా. మీరు పడుకోండి."

"నేనేమీ ఆర్జించి మీకు పెట్టక పోగా, మీపైనే నా భారం...."

"ఇక మాట్లాడకండి మావయ్యా అలిసిపోతారు"—అంటూ మాటలు మార్చ సాగింది శకుంతల.

"మావయ్యా. ఇన్ని రోజులు మీరు ఆర్జించి పెట్టింది కాదా మేం తిన్నది. మీరు చెమటోడ్చి కష్టపడితే కాదా మేం తిన్నది. మీరు పెంచితే కాదా మేం ఇంత వార మయింది. ఇప్పుడు మీరు "రిటైరయినంత మాత్రాన మాకేమీ లాభం చేకూర్చటంలేదని, మామీద భారంవేసి తిని కూర్చుంటారని మిమ్మల్ని ఏహ్యించుకోవాలా ? మీకు మేం సంపాదించి పెట్ట లేకపోయినా మిమ్మల్ని గౌరవించి తల్లి తండ్రులలాగ చూసుకోవడం మా బాధ్యత కాదా మావయ్యా ?" అంటూ శాస్త్రిగారి ముఖంలోనికి చూసింది శకుంతల

"అది కాదమ్మా ...." మరి మాట్లాడ లేక పోయారు.

మదిలో ఎంత సంతోషించారో, తన వారికి తనపైన ఎప్పుడూ ఒకే భావన ఉన్నందుకు.

* * *

పరంధామశాస్త్రిగారు పూర్తిగా కోలుకున్నారు. ఇప్పుడు ఆరోగ్యంగా వున్నారు.

ఒక దినం ఆయన పేర్న ఓ వుత్తరం వచ్చింది. అందులో, తమ కాలేజీలో పార్టు టైమ్ జాబు చేయటానికి అంగీకరించవలసిందిగా ఒక ప్రిన్సిపాలుగారు కోరారు.

ఆయన కిదేమీ అర్థంకాలేదు.

సాయకాలం చక్రధరం వచ్చాక ఆవుత్తరం ఇచ్చారు.

"అదా, ప్రిన్సిపాలు దగ్గర నుండే నాన్నా!" అన్నాడు చక్రి.

"అవును బాబూ. నాకు వుద్యోగం ఇస్తానంటూ కోరుతున్నారు. నేనాయనకు ఎలా తెలుసునో బోధపడటంలేదు." అంటూ ముఖంలోనికి చూచారు.

"ఆయన నా స్నేహితుడు నాన్నా. వాళ్ల ట్యూటోరియల్ కాలేజీలో లెక్చరర్‌గా పని చేయటానికి మిమ్మల్ని కోరేడు.

"ఆదినం మీరు చదువుతూన్న కథని నేనూ చదివేను నాన్నా. దాన్ని చదివి మీ భవిష్యత్తును వూహించుకొంటున్నారని గ్రహించ కలిగేను. మీరు అనవసరంగా బాధ పడ్తున్నారు. ఆ కథలోలాగ మిమ్మల్ని అందరు కించపరుస్తారని, అలోకువగా చూస్తారని. నా కర్థమయింది. మీ మనస్తత్వం. మీరు తీరిక సమయాన్ని సద్వినియోగం చేసుకోటానికి నా స్నేహితుని చేత ఆ వుత్తరం వ్రాయించాను. మీరు తప్పకుండా అంగీకరించండి నాన్నా.

"మరొక్క విషయం. మీరు మనుషుల్ని గురించి అనవసరంగా ఆపోహపడ్డారు. అందరు మనుష్యులూ ఒకలాగ వుండరు మీకు తెలియం దేముంది నాన్నా?

"మీరు ఆర్జించ లేనంత మాత్రాన, మీలో అసమర్థత ఎక్కువనీ, మాకు లాభసాటి వారు కాదనీ మిమ్మల్ని ద్వేషించగలమా? మిమ్మల్ని పెంచి పెద్ద చేసింది మీరుకాదా? మేం తిన్నది మీ సంపాదన కాదా? అలా మిమ్మల్ని కించపరచడం ఎన్నటికీ జరగదు నాన్నా." అన్నాడు చక్రధరం.

పరంధామశాస్త్రిగారు హృదయపూర్వకంగా ఆనందించారు తనవారి మంచితనాన్ని చూచి. మనుషులందరూ పంచదార కోసం ప్రోగయే చీమలూ కారూ, తేనె కోసం కూడే ఈగలూ కారూ, అందరూ రంగు మార్చుకునే ఉసరవెల్లులూ కారు! వెంకటామయ్యా! మంచిమనుషులూ కొందరున్నారు. అనుకుంటూ, తన అంగీకారాన్ని తెలుపుతూ ప్రిన్సిపాల్‌కు జవాబు వ్రాయడానికి టేబుల్ వైపు నడిచారు.

"నాకు ఎదురుగా కనిపించిన, అనుమానపు తెర జారిపోయిందిలే వెంకూ" అనుకున్నారు శాస్త్రిగారు స్వగతంగా.



వైజ్ఞానిక గాథాశతి - 52

# అదృష్టవంతుడైన పరిశోధకుడా?

- థామస్ ఆల్వా ఎడిసన్ -



'అవును' అంటారు ఎడిసన్ పేరు చెప్తే.

ఎడిసన్ చదువు నేర్చినది తల్లి దగ్గర. రైల్లో పేపర్ కుర్రవాని ఉద్యోగములో చేరినది పన్నెండో యేట. వ్యాపారంలో మిగిలిన డబ్బుతో కొన్నవి రైలు కుదుపుకి ఒరగబడి, పెట్టెలో మంటలు రేపిన ఫాస్ఫరస్సు వంటి రసాయనాలు. ఎంతో కొంత శ్రద్ధతో నేర్చినది, తన పిల్లవాణ్ణి కాపాడన్న కృతజ్ఞతతో స్టేషను టెలిగ్రాఫ్ ఆపరేటరు చెప్పిన టెలిగ్రాఫీ. పనిమీద ఉండిన శ్రద్ధా! — అరగంట అరగంటకీ తాను తన సీటులో ఉన్నట్టుగా అధికారికి గడికీ సిగ్నల్సు పంపే యంత్రాన్ని చేసి పెట్టేసి, తన చదువూ, ప్రయోగాలూ తాను చేసుకుంటూ, పట్టుబడి, ఉద్యోగము పోగొట్టుకునే టంతటిది. మళ్ళీ ఉద్యోగము దొరికినా దాన్ని చెయ్యలేక బోస్టను నగరము చేరి అక్కడా ఆ టెలిఫోను ఆపరేటరు పనే దిక్కయితే, అక్కడా తన పరిశోధనలూ, నిర్మాణాలూ పేటెంటు హక్కుల సంపాదనలే చేసే గడుసు బుర్ర. అక్కణ్ణుంచి న్యూయార్కు చేరి గోల్డు రిపోర్టింగు టెలిగ్రాఫ్ కంపెనీలో తీగలలో ఏదో తికమక అయితే, దాని సంగతి ఏమీ తెలియకపోయినా రిపేరు చేస్తానని తయారయే తెగువ! వాడి అదృష్టము తోసుకుపోయింది గాని మామూలు పరిశోధకుడా ఎడిసన్ ?

కాదు. మహా పరిశోధకుడు. మహా మేధావి కూడాను. పాపం పేదరికమువల్ల అందరికీ ఉన్న బడి చదువే లేకపోయింది. ముక్కుపచ్చ లారక మునుపే నౌకరీకి కుదురుకోవలసిన కష్టము వచ్చింది. లైబ్రరీ పుస్తకాలు చదివి రసాయన శాస్త్రము నేర్చుకుని రైలుపెట్టెలో ఒక మూల తన ప్రయోగాల రసాయనాలు దాస్తే, దుర్విధి ఫాస్ఫరస్ సీసాని ఒరగ తోసింది. తన ప్రాణానికి లెక్కపెట్టక రైలు పట్టాల నడుమ ఉన్న కుర్రవాడి జబ్బ పట్టుకుని గెంతే సాహసి ఎడిసన్. లభించిన అవకాశాన్ని జారబెట్టుకోకుండా టెలిఫోను ఆపరేటరు పనిని శ్రద్ధగా నేర్చుకున్నాడూ, ఆ ఉద్యోగము చేశాడు. తాను పని సీటులో ఉన్నట్టుగా అరగంట అరగంటకీ గంటకొట్టే, స్వయం చోదక యంత్రాన్ని నిర్మించాడు. వెనకటికి స్టీము ఇంజను మూషలకము (Piston)నకు చిన్న కుర్ర ఎవర్చి ఆవిరి ద్వారాన్ని మూసి తెరిచి చేసే సాధనము నిర్మించిన కుర్రవాడిలాగ అన్నమాట. ఇందుకు ఎంత పెద్ద తెలివి ఉండాలి ? గోల్డు రిపోర్టింగు టెలిగ్రాఫ్ కంపెనీలో తీగెల తికమకను సర్దేస్తాననడానికి ఎంతటి ఆత్మవిశ్వాసము ఉండాలి ? చెయ్యలేకపోతే నగుబాటు కాదా ? వెళ్ళాడూ, చక్కగా పరిశీలన చేశాడూ, తెలివితేటలుపయోగించి రిపేరు చెయ్యగలిగేడు. అసలు తీగెల మొదళ్లు ఎక్కడా ? అవి ఎలాగ వెళ్లాయీ, ఎక్కడ చిక్కుపడ్డాయి ? ఎక్కడ తెగిపోయాయీ? ఎక్కడ ప్రమ్మా వదులైపోయింది ? అన్ని సమస్యల్నీ ఒకదాని తర్వాత ఒకటే పట్టి సర్ది పెట్టాడు. ఇది అదృష్టమా, మహా మేధావి లక్షణమా ?

ఎలక్ట్రిక్కు దీపాన్ని ఎడిసన్ నిర్మించిన గాథ తెలిస్తే అతడు మహా అదృష్టవంతుడు కాదూ, మహా మేధావి అని తెలుస్తుంది.

"గోల్డు" కంపెనీ యజమాని ఎడిసన్‌కి రిపేరూ, యంత్రశుద్ధీ నవ్యసాధన నిర్మాణమూ చెయ్యమనే ఉద్యోగము యిచ్చాడు. అది చేసి చేసి సొమ్ము సంపాదించిన ఎడిసన్ స్వంత కంపెనీ పెట్టుకున్నాడు. ధనమన్నది అతనికి నవ యంత్ర నిర్మాణానికి సహాయకారి మాత్రమే, లోక సుఖ సంపాదనకి సాధనము కాదు. కనక ఫ్యాక్టరీ పనికి ఇతరులను నియోగించి తాను మెన్లోపార్కు అన్న గ్రామంలో చేరి, అక్కడ నిర్మాణాలు (Inventions) సాగించాడు. విద్యుత్ప్రవాహానికి వేర్వేరు లోహాల తీగెలు వేర్వేరు నిరోధాలు కలిగిస్తాయని తెలుసునూ, ఆ తీగెలు నిరోధము ఎక్కువ చేస్తూ ఎర్రగా కాల్తాయనీ తెలుసును అతనికి. రకరకాల తీగెలు చేసి వాటి విద్యున్నిరోధము ఎక్కువ చెయ్యడానికి సన్నగా ఇంకా సన్నగా చేశాడు. కొన్ని లోహాల తీగెలు తేజోవంతంగా వెలగడమైతే వెలిగాయి, కాని, ఆ హెచ్చు వేడికి కాలిపోయి బూడిదగా రాలిపోయాయి. ఏ వస్తువు మండడానికైనా ఆక్సిజను కావాలని అందరూ ఎరిగిన సంగతే అయితే, "ఆక్సిజనే లేకపోతే గ్యాసులైటు తీగె (మెగ్నీషియము తీగ వంటిది) వెలిగితే వెలుగును గాక, ఆక్సిజనుతో సంయోగించి బూడిద అయిపోదు" అన్న సంగతిని ఆలోచించి, ఒక బల్బులో ఇందాకటి సన్నని లోహ తీగెను అమర్చి, ఆ బల్బులోంచి గాలిని—అంటే ఆక్సిజనును కూడాను— తోడేసి చూసినవాడు ఎడిసన్. అలాగ గాలిని వీలైనంతవరకూ తోడేసి అప్పుడు మళ్లీ విద్యుత్ప్రవాహము పంపితే ఆ తీగ ఎనిమిది నిమిషాలపాటు వెలిగి కాలిపోయి పడిపోయింది.

ఈ పడిపోడము బల్బులో మిగిలి ఉన్న ఆక్సిజనువల్ల కాదూ, ఆ తీగె పదార్థానికి వెలుగుతూన్న ఉష్ణోగ్రత వద్ద జిగి లేకపోడమే అని గ్రహించాడు ఎడిసన్. ప్లాటినమ్‌తో సహా లభ్యమైన ప్రతి లోహపు తీగెనీ ఉపయోగించి చూచాడు.

రకరకాల దారాలు — పత్తి, సిల్కు, గడ్డి, వార అన్నిటినీ—మాడ్చి ఆ కర్బనీకృత దారాలు వాడేడు. వాటిల్లో ఒకటి 45 గంటలు వెలిగింది తెగి పడిపోయేలోగా. దారమైతే రోజు వాడే దీపాల్లో ఎలాగ నిలబడుతుందీ గాలికి దీపము వూగులాడితే రాలిపోతుంది ? పరీక్షకి నిలిచేది ప్రయోజనానికి నిలుస్తుందా ? రకరకాల కాగితాలూ, జంతువుల నరాలూ, మొక్కల ఈనెలూ—ఏవి దారము రూపానికి వచ్చేవైతే అవీ—వాడి చూచాడు. ఇది వైజ్ఞానిక తపస్సు కాదా ? అదృష్టము తెచ్చి పడేసిన వరమా ?

ఎవరో తెచ్చిన వెదురు విసనకర్రను అడిగి పుచ్చుకుని దాని ఈనెను తీసి మాడ్చి ఉపయోగించాడు. వెయ్యి కళ్లు పెట్టి వెతికేవాడికి పనికివచ్చేది ఎప్పుడో ఒకప్పుడు దొరుకుతుంది. ఇది అంతకు ముందు వాడిన వాటికంటె మెరుగనిపించింది. అయితే వెదురు రకాలు చాలా ఉంటాయి. వాటిల్లో ఏది శ్రేష్ఠము ? చైనా, జపాను, ఇండియా, బ్రెజీలూ దేశాలకు మనుష్యుల్ని పంపి రకరకాల వెదురు తెప్పించి సుమారు ఆరువేల సోదాలు చూశాడు. జపాను వెదురు బాగుంది. జపానులో వెదురు తోటలు సంపకము చేయించాడు. స్వంత తోటలు ! ఇదంతా అదృష్టఫలమేనా ?

కొంతకాలానికి తర్వాత ఎత్తి దారాన్ని లోషన్లలో ముంచి అరబెట్టి వాడిస్తే, ఆ దారము వెదురు ఈనె కంటె బాగా పనిచేసింది. ప్రకృతిలో లభ్యమైన వస్తువు లన్నిటినీ - కర్ర బద్దలూ, సాము చర్మాలతో సహా -వాడి, శ్రేష్ఠమైనగి దొరికిన తర్వాత ఆ దారాల్ని తనకు పనికివచ్చే రీతిగా మలచుకునే రాసాయనిక క్రియలు చేశాడు ఎడిసన్ అదృష్టము కాదు, మరి ఆతని తెలివీ, కృషి, ఇవీ కారణము, అతడు నిర్మించిన నేటికి మించిన ఉపయోగకర సాధనాలకి. సాధన నిర్మాతల (Inventors) లో సాటి అంతవాడు లేడు.

ఇన్ని చేసిన తర్వాత అదృష్టము కలిసి రాలేదు -అతని బల్బులు నమ్మలేదు జనము. "సంవత్సరాదినాడు సాయంకాలం భోజనానికి రండి" అని అందరికీ ఆహ్వానమిచ్చి, పెద్ద మైదానానికి చుట్టూ బల్బులు అమర్చి, వారంతా చేరగానే అవన్నీ ఒక్కమారు వెలిగించి చూపించాడు, భోజనాలు పెట్టి పంపించాడు. ఇది మాత్రము తెలివి పనే, అదృష్టానిది కాదు.

**సీరియల్**

# కరుణ






కొండముది శ్రీరామచంద్రమూర్తి

### జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. కరుణను మన్మథకు చేసుకోమని జమదగ్ని కోరినా కరుణ, ప్రసన్నలు ప్రేమించుకున్నందువల్ల ప్రసన్నకే ఇచ్చి చేయడానికి మన్మథ ఇష్టపడతాడు. మన్మథ కూడా పై చదువులు చదవటానికి విశ్వవిద్యాలయంలో ప్రవేశిస్తాడు. చలపతి మన్మథను చదివించాలని పట్టుపట్టటంతో ప్రసన్న చదువు మానేయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. కరుణ, మన్మథ, వీరభద్రంలు ఎం. ఏ. లో చేరటానికి వాల్తేరు వెళ్తారు. సీటు సంపాదించటానికి మన్మథచేసిన ప్రయత్నాలు వ్యర్థం అవుతాయి. చివరికి ప్రొఫెసర్ నీలకంఠం ద్వారా సీటు సంపాదించగలుగుతాడు మన్మథ. ప్రసన్న ఉద్యోగప్రయత్న సఫలమవుతుంది.

## 20

**సూర్యుడు** ఇటు పొడిచినా, ఆకాశం తల్లక్రిందులైనా, సముద్రాలు పొంగినా, పర్వతాలు పెళ్లగిలినా తమ తమ వ్యక్తిత్వాలు వీడని, సహజమైన దుష్టత్వాన్ని పోగొట్టుకోని మనుషులు కొంతమంది ఉన్నారీ ప్రపంచంలో. వ్యక్తిత్వాలు వీడని కోవకు బుద్ధుడు, గాంధిజీ మొదలగువారు ఉదాహరణలైతే, రెండవ రకానికి డాక్టర్ మలాన్, డాక్టర్ సాలాజార్, మావ్—సే—తుంగ్, వీరభద్రం ప్రభృతులు చక్కని ఉదాహరణలు. శాస్త్రీయమైన పరిశోధనలు చేసి ఒక పూవు రంగు మరొక పూవుకు తెప్పించవచ్చు. బ్రహ్మంగారు చెప్పినట్టు వేప చెట్టుకు మల్లెపూలు పూయించవచ్చు. కాలం కాని కాలంలో కొన్ని కొన్ని వింత ఫలాలను పండించవచ్చు. కానీ కుక్కతోక వంకరనూ, సింహాద్రి అప్పలస్వామికీ, వీరభద్రానికీ ఆడవారిపై గల ఆపుకోలేని తమకాన్నీ మనం అరికట్టలేము. ఇటువంటి రకం విద్యార్థులకు కళాశాలలు, కేళీశాలలు. విద్యవారికి వినయాన్ని కాక, అహంకారాన్నీ, శృంగార పాఠాలనూ నేర్పుతున్నది. చౌకబారు సంస్కారాన్నందిస్తున్నది.

వీరభద్రం, కళ్యాణిని చూచి ఆమెను తన కిచ్చి చేస్తారని తెలుసుకొన్నప్పుడు కల్లు తాగిన కోతిలా నరవశించిపోయాడు. కానీ తనొక సంవత్సరం వరకూ, మైలపోయే వరకూ వివాహం చేసుకోకూడదని తెలుసుకొన్నప్పుడు, ఆ కాలాన్ని సద్వినియోగం చేసుకొనేందుకూ, అందరిలాగా తను కూడా యూనివర్సిటీకి వెళ్దామనుకొన్నాడు. అందుకోసమని డబ్బుకు జమదగ్నిని ఇరకాటంలో పెట్టి తన కోర్కె నెరవేర్చుకొన్నాడు. విశాఖలో దిగిన రోజునే, చేసిన తప్పు పనికిగాను వెయ్యి రూపాయలు జరిమానా చెల్లించుకొని, విధిలేక మన్మథను ఆశ్రయించాడు. హృదయంలో మార్పు వచ్చినట్టూ, అనుభవంలో తను పరిణతికి వచ్చినట్లూ నటించి, మళ్లీ మామగారికి డబ్బు పంపవలసిందిగా అర్థిస్తూ ఉత్తరం రాశాడు. వచ్చేటంత వరకూ మన్మథ డబ్బు వాడుతూ, అతని గదిలోనే అతని కోరిక మీదనే తిష్ట వేశాడు.

తిష్ట వేశాడన్న మాటే గాని, తన స్వాతంత్ర్యాన్ని మాత్రం అతడు పోగొట్టుకోలేదు. సరిగ్గా పోస్ట్‌మెన్ వచ్చే సమయానికి మాత్రం, గదిలో హాజరుగా ఉండేవాడు. మనీయార్డరేదీ రాలేదు, అని తెలుసుకోగానే అందుకు జరిమానాగా మన్మథ దగ్గర అయిదో పదో పుచ్చుకొని, 'ఇప్పుడే వస్తా' అని వెళ్లిపోయేవాడు. ఆ వెళ్లడం వెళ్లడం ఎప్పుడో మళ్లీ ఏ అర్ధరాత్రికో రావడం. మన్మథకు అతని ప్రవర్తనా, చేష్టలూ, ఆలోచనలూ నచ్చక, అతనిని గురించి పట్టించుకోవడమే మానివేశాడు. తప్పి జారి ఎప్పుడైనా, "ఇదేమిటి భద్రం?—ఈ తిరగడం—" అని అడిగితే, "యూనివర్సిటీలో జాయిన్ అయిన తర్వాత, తిరగడానికి ఎటూ వీలుండదు. చుట్టుప్రక్కల ఉన్న అందమైన స్థలాలను ఇప్పుడే దర్శించుకు రావాలి." అంటూ పైపెచ్చు "భీమునిపట్నం నువ్వు చూశావా? —పోనీ, అరకులోయ పేరు విన్నావా ?—అక్కడదాకా ఎందుకంటావా ? — విశాఖలోనే ఎంత అందం దాగి వుంది—ఇక్కడి ఆడవాళ్లల్లో, ఇక్కడి సంపెంగ పూవుల్లో, ఈ సముద్ర తీరంలో, విరిగిపడే అలల్లో — వోహ్" అంటూ తన్మయభావాన్ని అనుభవించేవాడు.

కొన్ని రోజులు వీరభద్రాన్ని, హోస్టల్లో తనకు "గెస్ట్" గా అట్టే పెట్టుకున్నాడు మన్మథ. వారం పది రోజులు గడిచిం తర్వాత. "నీ మీద ఆధారపడి ఉండడం నాకు తల కొట్టేసినట్టుగా ఉంది." అని వీరభద్రం పెట్టె బెడ్డింగు పుచ్చుకుని సింహాద్రి అప్పలస్వామితో కలిసి, వూళ్లోకి వెళ్లిపోయాడు. అతనిని ఉండమని ఈసారి మన్మథ బలవంతం చెయ్యలేదు.

అతను వెళ్లిపోయిన మర్నాడే వూరినుంచి రెండు వందల యాభై రూపాయల మనీయార్డరు వచ్చింది. వీరభద్రం వచ్చి తీసుకుంటాడని వెయిట్ చేశాడు మన్మథ. కానీ అతని జాడ లేదు. దాంతో తనే అతన్ని వెతుక్కుంటూ వెళ్లవలసి వచ్చింది. వారినీ వీరినీ వాకబు చేయగా, చేయగా, వీరభద్రమూ సింహాద్రీ మరో స్నేహితుడి ఇంట్లో, పేకా

డుతూ కన్పించారు. ఆ గదంతా నానా గలీజాగానూ ఉంది. సిగరెట్టు పీకలు, చౌక రకం డిటెక్టివ్ నవలలు, హిందీలోనూ, ఆంగ్లంలోనూ సినిమా పత్రికలు, అన్నింటినీ పరిశీలనగా చూస్తూ మన్మథ తనలో అనుకున్నాడు. "ఈ జీవితం నేనూ అనుభవించాను. కానీ బయటపడ గల్గాను. ఈ భద్రం బయటపడలేడు."

మన్మథను చూడగానే వీరభద్రం నవ్వుతూ "నువ్వు వచ్చావా?—వెరీ గూడ్. నేనే వద్దామనుకుంటున్నాలే. నువ్వు 'మిడిల్ డ్రాప్' లో మొనగాడివి కదూ?— కాస్త హెల్ప్ చెయ్యరాదు?" అన్నాడు.

"సారీ మర్చిపొయ్యాను." మన్మథ అయిష్టంగా అని మంచం మీదకు వెళ్లి కూచుని, అక్కడ ఆ వస్తువుల్ను చూచి తేలు కుట్టిన ట్లయ్యాడు. నలిగిన పూలు ... విరిగిపోయిన గాజులు .... మన్మథ కలవరపాటును చూచి సింహాద్రి పెద్దగా నవ్వాడు. "మా స్నేహితు లొచ్చార్లే నిన్న ఈ గదికి రాత్రి యిక్కడే పడుకున్నారు." అతని మాటలు విని "అవునవును" అంటవు వీరభద్రం తలాడించాడు.

ఆ ఆట అయిందాకా కూచుని,ఆ తర్వాత వీరభద్రాన్ని బలవంతంమీద బయటకు తీసుకువెళ్తూ, "వీరభద్రం నీ కిహ చదువొద్దు. ఇట్లా అన్నానని కోపం తెచ్చుకోకు. ఇంటికి వెళ్లిపో. ఇంటిపట్టున ఉండి, ఏదైనా ఉద్యోగం చూసుకో" అని హితవు చెప్పాడు.

వీరభద్రం కళ్ళు మరింత ఎర్రబడ్డాయి. "ఏం?—ఎందుకు వద్దూ?— నువ్వేనా ఏమిటి చదువుకునేవాడివి? ఈ ముండమోసి ఎదువులు చదవడానికి రెండు వారాలు చాలు. రెండేళ్లక్కర్లేదు. ఇహనుంచీ ఇటువంటి నీతులూ, బుద్ధులూ నాకు చెప్పకు."

అంతటి పొగరుమోతు సమాధానం విన్నేసరికి మన్మథకు వళ్లమాలిన కోపం వచింది వచ్చింది. అయినా తమాయించుకున్నాడు. "అవును నేనే చదువుకునేవాణ్ని. నువ్వు చదవుకొనే వాడివే అయితే నాలాగే ఉండాలని నా అభిమతం" అన్నాను.

"ఆ అవసరం నాకు లేదు."

మన్మథకు క్షణకాలం అతని ముక్కెలు విరిచి కట్టి ఆ చెంపా ఈ చెంపా వాయిద్దామా అనిపించింది. "అవసరం ఉన్నదీ లేనిదీ, నా దగ్గర డబ్బు పుచ్చుకొన్ననాడే తెలిసింది. నేనూ, నువ్వూ కూడా ఒకరు పంపించిన డబ్బుతోనే చదువుతున్నావన్న సంగతి జ్ఞాపకం ఉంచుకో."

వీరభద్రం గోల్డ్ ఫ్లేక్ సిగరెట్ అంటించుకొని, వయ్యారంగా పొగ రింగులు రింగులుగా వదలుతూ ఉన్నాడు. "ఒకరు పంపించిన డబ్బు హు —అది నాకు బాకీ ఉండి మీ నాన్న నాకు పంపిస్తున్నాడు బ్రదర్."

'ఛీ' ఇహ నక్కడ నుంచో బుద్ధి పుట్టలేదు. వెళ్ళబోతూ, చివ్వరిసారిగా చెప్పి చూద్దామని, "పోనీ అట్లాగే అనుకో! నీకు బాకీగానే ఆయన పంపిస్తున్నాడు.



అయినా ఆ డబ్బును సద్వినియోగం చేసుకోవడం నీ కర్తవ్యం కాదూ?"

"ఈ సద్వినియోగమో, దుర్వినియోగమో అన్నవి మన మన దృష్టి భేదాన్ని బట్టి ఏర్పడుతున్నవి."

"సరేనయ్యా —నువ్వు చేస్తున్నదే మంచి పని. కానీ కళ్లకు కనిపిస్తున్న దాన్ని ఎట్లా కాదంటావ్? నువ్విక్కడికి చదువుకోవాలన్న మిషతో వచ్చావు. యూనివర్సిటీలో చేరతా నన్నావ్. ఏదీ? ఇది కూడా దృష్టిభేదమేనా?—నీకు మార్కులా సరిగా రాలేదు. నువ్వు అప్లికేషను పెట్టావో లేదో నాకు అనుమానం."

వీరభద్రం వెకిలిగా నవ్వాడు. "ఏం? నీకు సీటిప్పించిన ఆ మొనగాడు, నాకు మాత్రం ఇప్పించలేక పోతాడా?— నీపాటి చెయ్యక పోతానా పోతానా నేను."

మన్మథ మారు మాటాడలేదు. వెనక్కు తిరిగి వచ్చేస్తూ, "నీపేర మనియార్డర్ వొచ్చింది, నా కేరాఫ్ తో" అన్నాడు, విధిలేక చెబుతున్నట్టు.

"అంత మంచి మాట ముందు చెప్పొద్దు నువ్వు?"

మర్నాడు మనియార్డరు అందుకోవటానికి వచ్చినప్పుడు మళ్ళీ ఆ ప్రస్తావన తీసుకువచ్చాడు మన్మథ.

డబ్బు తీసుకుని లెక్క పెట్టుకుంటూ, "ఇంతే పంపించారేం?—నెలనెలా పంపిస్తారుట. ప్రతీ నెలా ఇదో ఎదురుచూడడం అన్నమాట మనకు?" అన్నాడు.

మన్మథ మళ్ళీ అడిగాడు. "డబ్బంటే తెప్పించుకుంటున్నావ్?—దానికి **తగిన** ఫలితం...."

"నన్ను గురించి నువ్వు **విచారించకు** మన్మథా. చెడిపోవడానికీ, మార్గంలోంచి తప్పిపోవటానికీ నేనేం చిన్నపిల్లవాణ్ని కాదు.

# కరుణ

పదేపదే నన్ను ప్రశ్నించకు. డబ్బు మాత్రం నెలనెలా సరిగా వచ్చేట్టు చూడు. నువు చూడవల్సిందల్లా అదే.''

ఏమి చెప్పి వీరభద్రాన్ని మంచి మార్గం లోకి తీసుకురావడమో మన్మథకు తెలీలేదు. అతను విన్నా వినకపోయినా తన కర్తవ్యం తనది. ''డబ్బు వచ్చిం తర్వాత, సీటు కోసం 'ట్రై' చేస్తానంటివి కదూ? విశ్వనాథం దగ్గరకు పోదాం పద. ఆయన ప్రొఫెసరు నీలకంఠాచారితో మాట్లాడతారు. వారే నాకు సీటు రావడానికి కారణం?

వీరభద్రం గదిలోనుంచి బయటకు వచ్చేశాడు. వచ్చేస్తూ అన్నాడు. ''నేనం వాళ్లనూ, వీళ్లనూ దేబిరించను. సింహాద్రి నాకు సీటు ఇప్పిస్తానన్నాడు.''

మన్మథ ఆశ్చర్యపోతూ అడిగాడు. ''దేంట్లో?''

''దేంట్లో పడితే దాంట్లోనే. నాకేమో 'డ్రామా సెక్షన్' లో చేరదామని ఉంది.''

మన్మథ బాధగా అడిగాడు. ''చివరకు ఇక్కడకు వచ్చి నువ్వు నాటకాలాడ్డమా నేర్చుకొనేది?''

వీరభద్రం నవ్వు సుడులు సుడులుగా గాలిలో తిరుగుతోంది. ఆ సుడులలోంచి మాటలు అలలుగా తేలి వస్తున్నవి. ''ఈ జీవితమే ఒక పెద్ద నాటకం. నీలాంటి వాళ్లు కొంతమంది సహజంగా నటిస్తారు. కానీ మేం నేర్చుకోవద్దూ?—మన మొహాలు మరొకరికి తెలియకుండా ఉండేందుకు, మన మాటలు మరొకరికి అర్థంకాకుండా ఉండేందుకు, మన చేతులు మరొకర్ని కంగారు పెట్టేందుకు, 'నాటకం' 'నటన' మనకు ఎంత సహాయం చేస్తాయని. యూనివర్సిటీవారు ఎంత ఆలోచించి ఈ కోర్సు పెట్టారని. నటన నేర్చుకుంటాను. ఆ తర్వాత సినిమాలో చేరతాను. లక్షలు కొద్దీ డబ్బు సంపాయిస్తాను. తెలిసిందా?''

మన్మథకు అతన్ని చూసి జాలి వేసింది. వీరభద్రం తప్పుదారిన బడి ప్రయాణం చేస్తూ అదే సరి అయిన దారి అనుకొంటున్నట్టు, అతనికి బాగా అర్థమైంది. అతనిని తమ రక్షించే మార్గం ఒకటే ఉంది. ఇంటికి ఉత్తరం రాసి, డబ్బు పంపకుండా చేయడం. డబ్బు రాకుండా పోతే, అతని పరిస్థితి నీటినుండి బయటపడ్డ చేప మోస్తరు. తిక్క కుదిరి అతనే దారికి రావచ్చు. కానీ ఇంటికి ఆ ఉత్తరం రాస్తే తర్వాత వచ్చే పరిణామాలను వూహించుకొని వణికిపోయాడు మన్మథ. వీరభద్రానికి తిక్క కుదరనూవచ్చు, లేక అతను మరింత బిర్ర బిగిసి వ్యర్థుడు కావచ్చు. ఆ పరిస్థితే సంభవిస్తే కట్టుకున్న గాలి మేడ కూలిపోగా, జమదగ్ని ఓలా పడిపోవచ్చు. శారదాంబ, అతనితో కళ్యాణికి వివాహము జరిపింపకపోవచ్చు. కళ్యాణికి లోకం చీకట్ల మయమై, ఆ అమాయక ప్రాణి వ్యధ చెందవచ్చు. మన్మథ ఉత్తరం రాయడాన్ని విరమించుకొని, వీరభద్రం స్నేహితులతో మాట్లాడాడు.

ముందుగా, సింహాద్రి అప్పలస్వామితో అన్నాడు. ''ముందుగా పరిచయం అయింది మన యిద్దరికీ. వీరభద్రం అమాయకుడు. అతన్ని చదువుకోనీ'' అని.

సింహాద్రి అప్పలస్వామి సమాధానం చిత్రంగా ఉన్నది. ''ముందు వచ్చిన చెవులకన్నా వెనక వచ్చిన కొమ్ములు ఎప్పుడూ వాడిగా ఉంటాయి. నాకు వీరభద్రం అప్పుడు. ఇహ అతని అమాయకత్వమా?—అతను నువ్వనుకొన్నంత అమాయకుడు గాడు. పైగా అతను చదువుకుంటానంటే, కాదు పేకాటకూ, ముద్దులాటకు రమ్మనేంత చెడ్డవాళ్లంకాదు మేం.''

దాదాపు ఇటువంటి రకమైన సమాధానాలే అతని మిగిలిన స్నేహితుల దగ్గర నుంచి కూడా వచ్చాయి. మన్మథ తను చూస్తూ చూస్తూ అతన్ని బాగుపర్చలేని బలహీనుణ్నయ్యానే అని బాధపడ్డాడు. తను చదువుకున్నా వీరభద్రాన్ని గురించిన ఆలోచనే అతని మనసును ఎక్కువ కలవరపెట్టింది. నీటిలో పడి కొట్టుకుపోతున్న మనిషిని, ఒడ్డున ఉండిచూస్తూ సహాయం చేయలేని మనిషిలాగా ఉన్నాడు అతను. మన్మథకు వీరభద్రం ఒక సమస్య అయ్యాడు. వీరభద్రానికి ఏ సమస్యా లేదు. కాలం అతని ముందు రంగులబొమ్మ క్రింద నర్తించసాగింది. అందం అతనికి మధుర పానీయమై మత్తు గొల్పుతోంది.

* * *

రాజా విక్రమదేవవర్మ కాంస్య విగ్రహం యూనివర్సిటీలోకి ప్రవేశించిన వారికి కర్తవ్యబోధ చేస్తున్నట్లుగా ఉన్నది. నిలువెత్తునా నిలబడి చుట్టూతా ఉన్న క్రోటన్స్ చెట్లాపట్లా లేసుకుని లే యెండలో, గాలి బాలతో ఆడుకొంటున్నాయి. అంత ప్రొద్దున్నే వచ్చి, కొందరు రిసెర్చి విద్యార్థులు, వెనగ్గా ఉన్న సైన్సు కాలేజీ

'లాన్స్' లో కూచుని మైక్రోస్కోప్పులతోనూ, టెస్ట్ ట్యూబులతోలూ, లావు పాటి పుస్తకాలతోనూ మంతనాలు సాగిస్తున్నారు. యూనివర్సిటీ అవుట్ గేట్ దగ్గర ఉన్న 'విద్యారామం' రెస్టారెంట్ దగ్గరికి తీర్థ ప్రజగా రాకపోకలు సాగిస్తున్నారు, అక్కడకు అతి దూరంలో లేని యూనివర్శిటీ హాస్టలు విద్యార్థులు. అంతా సందడిగా, యువ్వనం క్రొత్త రేకు తొడిగి నట్లు, ఆనందం క్రొత్తరూపు తాల్చి నట్లు, సముద్రమంత విశాలంగా, 'అవ్ ల్యాండ్' అంత ఎత్తుగా ఉన్నది అక్కడి సంరంభ లీల.

హాస్టలు గదిలో నుంచి, క్యాంటీన్ కని బయలుదేరి, ఎవరో స్నేహితులు కనబడి, విద్యారామునికి లాక్కుని వెళ్తూంటే వాళ్ల ననుసరిస్తున్నాడు మన్మథ. విక్రమదేవ వర్మ విగ్రహం దగ్గర విశ్వనాథం, కరుణ నిలబడి ఉండడం చూసి, స్నేహితులను పంపించేసి వాళ్ల దగ్గర వచ్చేశాడు.

"ఇదేమిటి ? .... ఇక్కడ నిలబడి ఉన్నారూ ?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

ఎర్రబడుతున్న ఎండలో విశ్వనాథం మొహం కాంతివంతంగా మెరుస్తోంది. ధోవతి కట్టుకొని, పైన గ్లాస్కో లాల్చీ వేసుకున్నా రాయన. కరుణ షిఫాన్ చీర కట్టుకొంది. 'అప్సర' చెప్పులు తొడుక్కుంది. జ్జా, మోచేతి వరకూ వేసుకుంది. అప్పుడే విచ్చిన మల్లెమొగ్గలా, స్వచ్ఛంగా ఉంది.

"మార్నింగ్ వాక్ " నవ్వుతున్నా రాయన. కళ్లల్లో, చెంపల్లో ఆ నవ్వు ప్రతిఫలిస్తోంది.

కరుణ చిరుకోపంతో అన్నది. "పొండి నాన్నారూ "

ఆయన నవ్వుతూనే అన్నాడు. "నిన్ను విడిచి పోలేకనే నమ్మా—ఇన్నాళ్లూ ఉన్నది" ఆయన మన్మథవేపు తిరిగాడు. "అసలు సంగతి చెబుతాను వినవయ్యా. అమ్మాయ్ ఏమో సముద్ర స్నానం చేదా మన్నది. సరే అని బయల్దేరాను. తీరా సముద్రం దగ్గరకి వెళ్లేసరికి సముద్రాన్ని చూసి భయం వేసింది. 'అబ్బ, చలిగా ఉంది. స్నానం వద్దు. కాస్సేపు మార్నింగ్ వాక్ చేద్దాం' అన్నది. ఇక్కడికి వచ్చేసరికి కాళ్లు నొప్పులు పుడుతున్నాయట. కాసేపు ఇక్కడ కూచుందా మన్నది. కానీ స్టూడెంట్సు కనబడడంతో, నవ్వుతారేమోనని మానేసింది."

కరుణ బుంగమూతి పెట్టింది. చేరుమాల ప్రేలికి చుట్టుకొంది. 'నమ్మకండి ఆ మాటలు' అన్నట్లు చూసింది మన్మథ వైపు. తండ్రి చెప్పడం అయిపోయిం తర్వాత వెంటనే తను అందుకొంటూ, "అదేం కాదు. సముద్రం దగ్గర ఎవరిదో ఓ స్త్రీ శవం కొట్టుకొచ్చింది బావా. శరీర మంతా తెల్లబడి పోయింది, కళ్లు, ఉబ్బి పొట్ట పైకొచ్చి, అబ్బ... అక్కడ ఉండలేక పోయాను. అందుకనే స్నానం వద్దని వచ్చేశాను. ఇక్కడిదాకా, నాన్నగారే నాకన్నా వెనుకగా నడవడం చూసి, ఆయనకే కాళ్లు నొప్పులు పుడుతున్నాయని, కూచుందా మంటేఒప్పుకోరని, నాకే కాళ్లు నొప్పులు పుడుతున్నా యన్నాను."

"అవును తల్లీ నువ్వు అనుకొన్నది నిజమే నాకే కాళ్లు నొప్పెడుతున్నాయి" అన్నాడు విశ్వనాథం, వాకింగ్ స్టిక్ మీద ఆనుకొంటూ.

"అయితే, మా రూముకు పోదాం పదండి ఇక్కడికి దగ్గర్లోనే ఉంది."

"ఎందుకు ? ఎందుకు?" అని వాళ్లు అభ్యంతర పెడుతున్నా, మన్మథ వాళ్లను బలవంతంచేసి, వివేక విన్యాసాలో ఉన్న తన గదికి తీసుకుపోయాడు. ఓ ముసలాయన, ఓ పడుచుపిల్లా మన్మథతో కలిసి తమ బ్లాకుకు రావడం వింత విషయమైంది అక్కడివారికి. కొన్ని పదుల కళ్లు వరండాలో నిలబడి ఆ ముగ్గురివేపూ ఉత్సుకతతో చూశాయి. 'అదృష్టవంతుడు' అనుకున్నారు కొందరు మన్మథను చూసి అసూయ పడుతూ.

మన్మథ ఇదేమీ గమనించలేదు. తన గదికి వాళ్లని దర్శి తీసుకువెళ్లి, 'బ్లాక్ బోయ్' చేత కాఫీ టిఫిన్లు తెప్పించి, ఆతిథ్యము నెరపాడు. కాఫీ తాగుతూ, తాగుతూ అతని విషయం జ్ఞాపకం వచ్చి, విశ్వనాథం ఆ ప్రస్తావన చేశారు. "వీరభద్రం కనిపించ డేమిటయ్యా ?"

మన్మథ గతుక్కుమన్నాడు. పొలమారింది సర్దుకుని, "నాకూ కనిపించడంలేదండీ." అన్నాడు.

కరుణ తానేదో క్రొత్త విషయాన్ని చెబుతున్నట్లు, "మొన్న ఎవరితోనో కలిసి తిరుగుతూ, దూరంగా కనిపించాడు. ప్రక్కన ఉన్న అతను 'ఈవ్—టీజర్' అని రాజా చెప్పింది."

"రాజెవరు ?"

"నీకూ తెలుసు బావా. రజని అని మన పూరునించే వచ్చింది. నేనూ, ఆ అమ్మాయి మీ తమ్ముడుగారూ బియ్యేలో క్లాస్ మేట్స్ం కూడాను"

మన్మథ, రజనిని గుర్తుకు తెచ్చు కోవటానికి ప్రయత్నం చేశాడు. ఎర్రగా ఎప్పుడూ మౌనంగా ఉండి ఏదో ఆలో చిస్తున్నట్లుగా కన్పించే ఒక అమ్మాయి జ్ఞపకం వచ్చింది. 'ఈవ్—టీజర్' ఎవరో పోల్చుకోవడం అతనికి పెద్ద కష్టం మనిపించలేదు. తప్పకుండా అతను సింహాద్రి అప్పలసామే అయివుంటాడు.

కాసేపు కూచుని తండ్రీ—కూతు ళ్లిద్దరూ వెళ్లిపోయారు. వాళ్లటు వెళ్ళ గానే బిలబిలలాడుతూ కొంతమంది స్నేహితులు మన్నథ గదిలోకి ప్రవేశించారు.

"ఎవర్రా బ్రదర్ వాళ్లు ?" అని అడిగాడు వాళ్లలో ఒకడు. అతనికేదో మహా



అదృష్టం పట్టిందన్న ఉద్దేశ్యంతో వాళ్ల కళ్లు మండుతున్నాయి.

"మా మామగారూ,—ఆయన కూతురూనూ."

"వెరీ గూడ్—మేమూ అదే అనుకున్నాంలే." మరొకడు అందుకున్నాడు.

"బ్రదర్ ఈసారి తాళాకోళీ పార్టీ యిస్తే వప్పుకొనేది లేదు. ముందు టీపార్టీ, అటుమ్మ్ తెలుసా, రెండు స్వీట్లు, రెండు హాట్లు, ఫ్రూట్‌సాలడ్, కాఫీ, కిళ్లీ, మ్యేక్రో పోలో సిగరెట్ అఫ్‌కోర్స్ ఫాలోడ్‌బై హిందీ సినిమా" మూడో స్నేహితుడు తన కోర్కెలు బయట పెట్టాడు.

"ఎందుకూ" మన్మధకు వాళ్ల సంబరానికి అర్థం తెలియలేదు.

"అంత వోల్డ్ ఫాదర్‌ఇన్‌లా, ఆయనకు అంత యంగ్ బ్యూటిఫుల్ డాటర్ ఉన్నందుకు. లక్కీఛాన్సురా భాయ్ నీ రొట్టె విరిగి నేతిలో పడ్డది. మ్యారేజీకి మమ్మల్ని పిలవకపోయినా ఫర్వాలేదు. కొడుకు పుట్టినప్పుడు బారసాలకైనా పిలవ్వటా?"

అంతసేపూ వాళ్లేం వూహించుకుని, ఆ వేళాకోళం చేస్తున్నదీ అప్పుడు మన్మధకు అర్థమైంది. వాళ్ల మాటల అర్థాలు తెలిసి, కోపంతో వణికిపోతూ, "నో. నో. యూ ఆర్ రాంగ్. కరుణకు మ్యారేజ్ అయింది" అన్నాడు.

గుంపులో నుంచి మరో మాట విన

## కరుణ

వచ్చింది. "మ్యారేజ్ అయిపోయింది కాబట్టే, బారసా కైనా పిలవమంటున్నాం. మా అభ్యర్థనను కాదనవద్దంటున్నాం."

వాళ్ల భావాలనూ, మౌఢ్యాన్నీ వూహించుకొనేసరికి విపరీతమైన అసహ్యం కల్గింది మన్మధకు వాళ్లమీద. వాళ్లతో ఒక్కమాట మరొక్క నిముషం మాట్లాడినా, హృదయానికి బాధ కల్గే విషయాలు వినడం తప్ప మరొకటి లేదనుకొని, "కాదు. మీ రనుకొన్నదంతా అబద్ధం, కరుణ నాకు మరదలు. చెల్లెలితో సమానం. ఎప్పుడూ ఈవిధంగా వూహించుకోకండి. అనకండి. వెళ్లండి. వెళ్లండి. ప్లీజ్" అంటూ వాళ్లను బయటకు నెట్టి వేయటానికి ప్రయత్నం చేశాడు.

వెనక్కు వెళ్లిపోతూనే, ఆ గుంపులో నుంచి మరో విద్యార్థి, ఒక ప్రశ్న వేసి, తనే నవ్వుకున్నాడు పెద్దగా. "మరద లంటున్నావ్?—నీకు పెళ్లయిందా?"

"నాకు కాలేదు. మా తమ్ముడికి అయింది.."

అందరూ నవ్వారు—అంత పెద్ద జోక్ అంతకు పూర్వం ఎప్పుడూ వినలేదన్నట్లు. వాళ్లల్లోంచి కొంచెం పొడగరిగా కన్పిస్తున్న కుర్రాడొకడు అన్నాడు. "చూశావా ఆడది అబద్ధం చెబితే గోడ కట్టినట్లుంటుందట. మగవాడు అబద్ధం చెబితే—"

"తడిక పెట్టినట్లుంటుంది." కీచు గొంతుకతో ఎవరో పూర్తి చేశాడు.

"ప్రేమ వ్యవహారం ఇట్లా దాస్తావేమిటోయ్. పదిమందికీ గర్వంగా చెప్పుకుని ఆనందించాలిగానీ.... నాకే ఇటువంటి ఛాన్సు వస్తే, నా సామిరంగా...."

ఆ కుర్రవాడు మాట పూర్తి చేయలేదు. మన్మధ కొట్టిన దెబ్బకు ఛెంప వాచిపోయింది. అతను మన్మధవేపు కోపంగా, మింగేసేట్లు చూసి, 'హు' అని పెద్దగా మూలిగి, "పిల్లి పాలు తాగుతూ లోకం తన్ను చూడలే దనుకుంటుందట" అని, చెంప తడువుకుంటూ వెళ్లిపోయాడు. అతను వెళ్లిపోయిన తర్వాత మిగిలిన విద్యార్థులు కూడా, మన్మధనే తప్పుపట్టి అతనికి ఆ తొందరపాటు తగదని హితవు చెప్పి, అతను గనుక ఆ కుర్రవాడికి 'అపాలజీ' చెప్పుకోకపోతే తామంతా ఇహ అతనితో స్నేహం చేయడం మానుకోవలసి వస్తుందని హెచ్చరించి, వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లిపోయిన తర్వాత, మన్మధ తలుపువేసి వచ్చి, మంచంమీద కూలబడ్డాడు. అతనికి మనస్సంతా నానా కంగారుగానూ ఉంది. తనకూ, కరుణకూ సంబంధము అంటగట్టిన ఆ వెధవలను చిత్రహింస చేయాలనిపించింది. కానీ ఒకడు, ఇద్దరు కాదు, పదిమంది పైన ఉన్నారు, చెబితే వినిపించుకోని కోతులు. తను రాయి విసిరితే, అవి రాయి విసురతాయి. తను పారిపోతే అవి వెంట బడుతాయి. తను ధైర్యంగా నిలబడాలి, అంతకన్నా మార్గం లేదు. వాళ్ల కేమాత్రం అవకాశం ఇవ్వగూడదు. తనను గురించి వాళ్లేం వూహించుకున్నా, తనకేం పెద్ద విచారంలేదు. కరుణను వాళ్లు తక్కువగా అంచనా వేసుకోకూడదు, తప్పుగా అర్థం చేసుకోకూడదు.

ఆపూట అతను హాస్టలుకు భోజనానికి వెళలేదు. బయటకు కదలటానికే బుద్ధిపుట్టలేదు. 'మెస్' లోంచి గంట వినబడుతోంది. మొదట బంతికి వెళ్తే పెరుగులో మీగడ దొరుకుతుందని భోజనప్రియులు కొందరు వరండాలో పరుగెత్తుతున్నారు. వివేక విన్యాస హాస్టలు బ్లాకు వెనుక నున్న 'కిచెన్' లోంచి సాంబారు వాసన ముక్కులను పిండుతున్నది.



హిట్లర్, ముస్సోలినీ, స్టాలిన్ వగైరాలు గుర్తుకొస్తారు జన్నికి.

ప్రేమని చూసి రెండేళ్ళయింది. ప్రేమ అందంగా ఉంటుందా ? ఏమో ! కాని ప్రేమను తల్చుకున్నప్పుడు జన్ని ఎదలో ప్రేమ రగలదు. సున్నితం, లాలిత్యం, మార్దవం లాంటి జన్ని కెంతో యిష్టమయిన లక్షణాలు ఆమె పేరులో మాత్రమే ఉన్నాయిట.

కాని ఆ విషయం వెంకటావుతో చెప్పగల ధైర్యం, మానసిక బలం జన్నికి లేవు. అంచేత ప్రేమ ఎవర్నోగాని, ఎవరో ప్రేమనిగాని, లేదా వెంకటావు తనని గాక మరొకర్ని గాని ప్రేమించి, ప్రేమ పెళ్ళి తనతో తప్పిపోయేలా చేయడానికై దేవుణ్ణి గుర్తుచేసుకుంటుంటాడు జన్ని.

ఆ సాయంకాలం అలా పోతూంటే పరమేశ్వరరావు కనిపించాడు. "ఎన్నాళ్ళయిందిరా పరం, నిన్ను చూసి? ఏం చేస్తున్నావు యిన్నాళ్ళూ ? ఏయే వూర్లు చూశావు! ఎంతమందిని ప్రేమించావు ? అసలు కనపడకుండా ఏమైపోయావు ? పోనీ ఉత్తరమైనా వ్రాసి ఏడవ్వేం ?" జన్ని ప్రశ్నల వర్షం కురిపించాడు.

"ఆరు నెలలు. చదవటం యిష్టంలేని అబ్బాయిలకి చదువు చెపుతున్నాను. చూసిన వూరు ఒకటే. పదకొండు నుందిని. డబ్బు సంపాదించే దెలాగన్న జంజాటనలో చదువు, స్నేహితులు వగైరా అన్నీ మరిచిపోయాను. ఉత్తరం వ్రాసి ఏడవడానికి టైం దొరకలేదు." వరసక్రమంగా జవాబిచ్చాడు పరం.

"ఆ వూర్లో ఏం చేస్తున్నావు ?" పరం చెప్పిన వూరిపేరు విన్నాక ఆశ్చర్యంగా అడిగాడు జన్ని.

"చెప్పానుగా, వో క్కుర్రాడికి చదువు చెప్తున్నాను."

"అదేం, నీ చదువు ఏమయింది? మళ్ళీ మార్చికి కట్టాతన్నావుగా "

"మార్చికి కట్తున్నాను. కాని మానాన్న మనకి ఏడాది కింత అని ప్రిపే పర్సు ఏర్పాటు చేశా డీమధ్య. మన ఖర్చు — ఆదాయాన్ని మించిపోతూంది. డిశంబరుదాకా రావాల్సింది ఫిబ్రవరిలో అయిపోయింది. ఆయనని మళ్ళీ అడగడం యిష్టంలేదు. అందుకని "సంపాదించుకుని, చదువు" అన్న సూత్రం అమలు పరుస్తున్నాను."

"ఆ వూర్లో వెంకటావు అని వో పెద్ద మనిషి ఉన్నారు తెలుసా ?"

"వాళ్ల అబ్బాయికేగా నేను పాఠాలు చెప్పేది !"

"బుజ్జికి నీవు గురువువా ? గాడ్ సేవ్‌యూ! భగవంతుడు రక్షించుగాక!" ముందు ఇంగ్లీషులోనూ, ఇంగ్లీషురాని పాఠకుల కోసం తరువాత తెలుగులోనూ అన్నాడు జన్ని.

"దేముడు రక్షించేందుకు ఏమీలేదు! భుజంగరావుకి చేపలు పట్టడం హాబి. బంగాళా బాబుల నవలలు చదవడం రెండోది. ఒక గాలం, గారెముక్కలు పుచ్చుకుని వాళ్ళ ఇంటి వెనక కాలవ ఒడ్డున కూర్చునుంటాడు ఇరవైనాలుగు గంటలు. చేపలు పట్టడం, అవి గిలగిల తన్నుకున్నాక మళ్ళీ నీళ్లలో వదలడం—అదీ అతని పని. ఆపని చేసుకోనిస్తే మనకి పోయేదేం లేదు. మన జీతంరాళ్లు మనకి ముడ్తాయి. వెంకటావుగారు అటుకేసి రారు. ఇంక ఆ ఇంట్లో అతన్ని అడిగేవారు లేరు."

"వూ మళ్ళీ క్రొత్తగా ఎవరినైనా ప్రేమించావా ?"

"నీకు వేళాకోళంగానే ఉంటుంది గాని, ప్రేమలాంటిది మరొకటి లేదు యీ ప్రపంచంలో. ఆ ఆలోచనే ఎంత తియ్యగా ఉంటుందో చూడు." పరం కళ్లు కలల్లో తేలి తేలిపోతున్నాయి.

"నువ్వు చెప్పే ప్రేమ ఎవరన్నా మనిషి పేరా ? లేక ప్రేమించడానికి సంబంధించిన నామవాచకమా ?"

"కుమారి ప్రేమ వెంకటావుగారి అమ్మాయి. ప్రేమని తల్చుకున్నప్పుడల్లా నా గుండెల్లో సితార్ మీటినట్లు, ఎక్కడో దూరాన మబ్బులనించి లత, ఆశ, గీత, వగైరాలంతా పాడుతున్నట్లు, నేను అలా అలా నీలి మైదానాల్లో చుక్కలమధ్య తేలిపోతున్నట్లు ఏవేవో నాకే తెలియని, చెప్పడానికి మాటలు చాలని అనుభూతులు కలుగుతాయి "

"మై ఫుట్ !"

"నాగురించేమన్నా భరిస్తాను గాని,ఆమెని మాత్ర మేం అనకు. ఇంతకీ ప్రేమ నీకు తెలుసా."

"తెలుసు."

"ఒక్కసారి నాకు పరిచయం చెయ్యి. నీ ఋణం మళ్ళీ జన్మలో నువ్వు అమ్మాయై పుట్టే నిన్ను ప్రేమించి తీర్చుకుంటాను !" ప్రాధేయపడ్డాడు పరం.

* * *

నాలుగు రోజులు పోయాక ఆ వూర్లో వెంకటావుగా రింట్లో జన్నిని ఒక ముఖ్య అతిధిగా చూశాడు పరం. ఆ సాయంకాలం యిద్దరూ కాలవ వడ్డున తోటలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూంటే దూరంగా వంతెనమీద గాలం నీళ్లలోకి వదిలి కనబడ్డాడు బుజ్జి.

ఉన్నట్లుండి జన్నికి ఒక అద్భుతమైన ఆలోచన వచ్చింది.

"పరం. నీకు ప్రేమ మనసు కావాలి గదూ !"

"మన సొక్కటే గాదు, ఇంకా చాలా కావాలి."

"అయితే నేను చెప్పేది విను. ప్రేమకి ఈ బుజ్జి అంటే పంచప్రాణాలు. ఇతగాడు కాలుజారి ఆ వంతెనమీద నించి నీళ్లలో పడ్డాడనుకో. వూపిరాడదు. మూడు మునకలూ అయిపోతాయి. ప్రేమ అలా ఒడ్డున నిలబడి 'రక్షించండి ! రక్షించండి!' అని బుల్లి తమ్ముడికోసం అరుస్తూంటుంది. అప్పుడు ఈ గుబుర్ల చాటు నుంచి టెర్లిన్ పాంటుతో సహా నీళ్లలో కురికి వాడిని బయటికి లాగి ప్రథమ చికిత్స చేసి, తిరిగి ప్రాణం పోస్తావు. ప్రేమ మనసు కృతజ్ఞతతో నిండిపోతుంది. "మీా రెంత మంచివారండీ ! మీారు లేకపోతే నా చిట్టి తమ్ముడు ఏమయిపోయేవాడో ! సమయానికి దేముడిలా వచ్చి కాపాడారు. మీా రుణం ఎలా తీర్చుకోడం !....అరే ! పాపం, మీా టెర్లిన్ పాంటు కాస్తా పాడయిపోయిందే చ్....చ్చ్...." అని వాపోతుంది.

"ఓ దట్సాల్‌రైట్! మానవసేవయే మాధవసేవ" అంటూ చప్పరిస్తావు నీవు. అప్పుడు ఆమె అభిమానం, గౌరవం, ప్రేమ ఇత్యాదులు నిండిన కళ్లతో ఒక్కసారి నీకేసి వాలుగా చూసి తలదించుకుంటుంది...."

"గోష్..... టెరిబుల్ జన్నీ, నీ మెదడు యింతేసి ఆలోచనల్ని ఉత్పత్తి చేస్తుందంటే నమ్మలేకుండా వున్నాను, చాల ఆశ్చర్యంగా వుంది,....అయితే ఒక చిక్కుంది. అతగాడి కాలు ఎప్పుడు జారుతుందో! అప్పటిదాకా యింతేనా?" దైన్యంగా అడిగాడు పరం.

"అదంతా నేను చూసుకుంటానుగా రేపు సాయంకాలం నాలుగింటికి నువ్వీ గుబుర్లో దాక్కో. ప్రేమ నిక్కడికి తీసుకువస్తాను. కాసేపటికి బుజ్జి నీళ్లలో పడతాడు. వెంటనే నీళ్లలో కురికి రక్షించు."

అంత చక్కని ఆలోచన పుట్టినందుకు తనని తానే అభినందించుకుంటూ రాత్రి హాయిగా నిద్రపోయాడు జన్నీ.

జన్నీకి ఓ పెద్ద రణరంగంలో పెద్ద యెత్తున వ్యూహాన్ని పన్నుతున్నంత సంబరంగా వుంది. యుద్ధభూమిలో జనరల్ ముందుగా బ్రిగేడియర్స్‌ని పిలుస్తాడు.

"నీ టాంక్స్‌ని యీ గుట్టమీదకి నడిపించు", "నీ గన్స్‌ని యీ కొండవాలులో యీ కోణంలో వుంచు", "నీ ట్రూప్స్‌ని ఇలా నడిపించు' అని ఇసుక మోడల్ మీద వివరించుతాడు. ఈ మూడు అనుకున్న చోట్లకి, అనుకున్న సమయానికి చేరుకుంటే దీపావళి మజా చూడముచ్చటగా వుంటుంది. అలాకాక టాంక్స్ మరో గుట్ట మీదకి, గన్స్ వేరేచోటికి వెళ్లి, ట్రూప్స్ అనుకున్న వేళకి రాకపోతే ఫలితం అలా యెందుకయింది తర్కించడానికి వేరే మనుష్యులు రావాలి.

కాని, జన్నీకి తన వ్యూహ్యం గురించిన ఫలితం విషయంలో ఎలాంటి అనుమానమూ లేదు. వంతెన చివర్న నాలిగింటికి బుజ్జి ఎలాగూ కూర్చునుంటాడు. ప్రేమ జన్నీ వచ్చేవేళకి ఊర్లోలేదు. కాలక్షేపానికని ఎవరో స్నేహితురాల్ని పిలుచుకు రావడానికి ప్రక్కవూరు వెళ్లిందట. కాని రేపటికి తప్పకుండా వచ్చేస్తుందంది అత్తయ్య. రాగానే ఆమె నక్కడికి తీసుకురావడం తన చేతిలో పని. మిగతాదంతా సెకన్ల మీద జరిగిపోతుంది.

# డామిట్!

మర్నాడు సాయంకాలం అంతా అనుకున్నట్లే జరిగింది. ప్రేమ ఉదయమే వచ్చింది. అలా తోటలో తిరుగుదాం అని తీసుకువచ్చాడు ప్రేమని జన్నీ.

"నువ్వెంత మంచివాడివి బావా! నాకోసం యింతదూరం వచ్చావని విని ఎంత పొంగిపోయానో తెలుసా?" అంది ప్రేమ జన్నీ ప్రక్కన నిలబడి.

జన్నీ సమాధానం ఈయలేదు.

దూరంగా బుజ్జి వంతెన ప్రక్క రెయిలింగ్ మీద కూర్చుని గాలం నీళ్లలో ఆడిస్తూ అటే చూస్తున్నాడు.

"ప్రేమా, నీతో ఒక సంగతి చెప్పాలని వుంది, ఏమనుకుంటావో"

"చెప్పు బావా, మనలో మనకేమిటి?"

"నా స్నేహితుడొకడు వున్నాడు"

"ఉన్నాడు.. వుంటే ?"

"వాడికి నిన్ను తలచుకున్నప్పుడల్లా గుండెల్లో తీయని బాధ కలుగుతుందిట. లత ఆశ, గీత డ్యూయెట్లు పాడుతున్నట్లు, మేఘాలు సితార్ వాయించినట్లు, చంద్రలోకంలో అప్సరసలు నాట్యం చేస్తున్నట్లు ఉంటుందిట"

"ఊహూ," ఆశ్చర్యం నటించింది ప్రేమ.

"నిన్ను చూడకుండా ఉండలేడు, చూసి వేగలేడు, వెన్నెల్లో వేడి, చల్లగాలి గాడ్పు, మల్లెల్ని తాకితే ముళ్ళు గుచ్చుకోడం. అదీ వాడి పరిస్థితి. నీకు వింటూంటే జాలి కలగడంలేదూ,"

ప్రేమ నవ్వు బలవంతాన ఆపుకుని, తల ప్రక్కకు త్రిప్పుకుంది.

"అది సరేగాని, బావా తమ్ముడు చూడు ఎంత చిగుర్న కూర్చున్నాడో? వద్దంటే వినడు. క్రిందపడితే ఏంకాను?"

"నే పిలుకొస్తానుండు." జన్నీ బయల్దేరాడు.

అద్భుతమైన అవకాశం. దగ్గిరికి వెళ్ళినట్టే వెళ్లి బుజాన్ని అలా తాకితే చాలు క్రిందపడతాడు. సమయం సరిగ్గా నాలుగు యాభైకి పరం ఆగుబుర్లలోకి చేరుకనుండాలి. ఏదన్నా మంచి పని తలపెడితే, ప్రయత్నం లేకుండానే అన్నీ వాటంతట అవి సమకూడాయనేవాడు తెలుగు మాష్టరు. ఆయన మాట యిక్కడ బుజువైంది. జన్నీ మనసులో తెలుగు మాష్టారికీ, దేవుడికీ కృతజ్ఞత చెప్పుకున్నాడు.

"హాలో బుజ్జీ, హౌ! ఆర్ యూ ?"

"హౌ ఆర్ యూ?" చాలా మామూలుగా అని జన్నీ వంక చూశాడు బుజ్జి. అప్పటికి జన్నీకి బుజ్జికి మధ్యదూరం అయిదడుగులు వుంది. ఆ అయిదడుగులు జన్నీ ఎన్ని అడుగులు వేసినా తరగనట్టుంది. జన్నీ మనసులో ఆందోళన, ఆరాటం ఎప్పటికప్పుడు ఆ మధ్యదూరాన్ని రెండు పెట్లు గుణిస్తూంది. చెమటలు పోయసాగాయి.

ఆ పరిస్థితి అంతకుముందు ఒకసారి అనుభవమైందతనికి. కాలేజీలో నాటకం వేస్తున్నారు. జన్నీ వంటవాడు. ఒక అమ్మాయి మహారాణి. స్టేజి మధ్యలో టేబిల్ వేశారు. మహారాణి భోజనానికి అన్నీ అమర్చి వున్నాయి. వంటవాడు మంచినీళ్లు పట్టుకురావాలి ప్లేటులో. జన్నీ తెర లేవగానే స్టేజి మధ్యకి నడిచాడు. స్టేజి ఆమూలాల నడవడం మొదలు పెడితే ఎంతకీ 'మధ్య' అనేది రావడంలేదు. సహారా యెడారిలా మైళ్లకి మైళ్లు సాగిపోతూంది. కళ్లు మూసుకుని అక్కడికి చేరి, తెరచి చూసేసరికి మహారాణిగారు ఇంకా రాలేదు. ప్లేటులో గ్లాసు భరతనాట్యం, కథాకళి, చాచాచా, ట్విస్ట్ అన్నీ వరసపెట్టి చేసేస్తూంది. చివరకి అలిసిపోయిన గ్లాసు విసిగెత్తి క్రింద పడబోయింది. కాని అదృష్టవశాత్తూ మహారాణీ గారు అప్పుడే వేంచేయుడంవల్ల ఆమె పైట మడతల్లో ఆగింది. ఆమె అదొక



మాదిరి శబ్దం చేసింది. ఆశబ్దం హోలంతా ప్రతిధ్వనించి వెయ్యి శబ్దాలైంది. కాని జన్ని మెదడ్లో కేమీ యెక్కలేదు. ఎదురుగా ఆకాశమంత స్టేజి, మధ్యలో దిక్కుతోచని తను.

బుజ్జి దగ్గిరికి ఆపుకోలేని ఉత్సాహంతో అడుగులు వేస్తూంటే జన్ని మనసులో ఆనాటి సంఘటన తాలూకు వెణుకులు మెదడ్లో మెదిలాయి. ఒళ్ళు యింకా చెమటలు పోసింది.

బుజ్జి జన్ని వంక అదోలా చూశాడు 'ఎవర్రా నువ్వు?' అన్నట్టు. ఆ మాపు చూస్తూంటే జన్నికి వింత అనుభూతి కలుగుతుంది. కాలేజిలో జేరిన మొట్ట మొదటి రోజు, తనకి సరిగ్గా అతకని డొళ్ళపాంటుతో, క్లాసుకి ఆలస్యంగా అబ్బాయిలు, అమ్మాయిలు అంతా గుచ్చి చూస్తుంటే, నూరు అడుగుల దూరం సిమెంటు ఫ్లోర్ మీద, కిర్రుమనే కొత్త చెప్పుల హోరు బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ యిస్తుంటే నడిచి వెళ్ళినప్పుడు యిలా-ఈగ, నల్లి, దోమ అంతకన్న చిన్నది అ పోయినట్టు అనుకున్నాడో, యించుమించు అలాగే అనిపిస్తూంది యిప్పుడూను.

కాని, యిది చాల పెద్దపని. దీని మీ ఒక్క పరం భవిష్యత్తు మాత్రమే కా తనది కూడ ఆధారపడి ఉంది. కాబట్టి వ్యక్తిగత యిబ్బందు లెలాంటివైనా కున్న పని చేసితీర్చాండే

"ఏరా, ఎలా వుంది చదువు?"

"మరీ ముత్తాతలా చదువెలాగుం రోజూ వేళకి తిండి తింటున్నావా? ఆం మవుతుందా? అంటూ యీ చచ్చు ప్రశ్న లేమిటి బావా?" బుజ్జి నవ్వాడు.

జన్నికి కొంచెం అవమాన మనిపించినా భరించాడు.

"ఏయే సినిమాలు చూశావు యీమధ్య?"

"యిదొక బోర్! అయిదో క్లాసు చదివే ఆడపిల్లలడుక్కునే ప్రశ్న."

జన్ని ఇంకేం మాట్లాడలేదు. కళ్ళు మూసుకుని బుజం మీద ఒక్కటి చరిచాడు, అదోలా నవ్వుతూ, అంతే

జన్ని కళ్ళు తెరిచేసరికి బుజ్జి నీళ్ల లోంచి తేలుతూ మునుగుతూ ఉన్నాడు. యిదే సమయం పరం రావాలి కాని ఏడి?...

పరం రావడంలేదు. జన్ని యీల వేద్దామనుకున్నాడు. పరం పరం అని అరుస్తూ వంతెన ఆమూలనించి ఈమూలకి పరుగెత్తాలనుకున్నాడు. కాని ప్రేమ దూరా న్నుంచి పరుగెత్తుకొస్తూంది. ఉన గురించి







# డామిట్ !

ఏమనుకుంటుందో!

ఇంక తప్పదు.

మరో అయిదు సెకన్లకి జన్ని నీళ్ళలోకి ఉరికాడు. బుజ్జిని రక్షించకపోతే, వాడికే దన్నా అయితే, మామకి మొగమెలా చూపెట్టడం?

నీళ్లలో మొదటి మునక మునిగి లేచేసరికి బుజ్జి అయిదు గజాల దూరంలో యీదుతూ కనిపించాడు. బుజ్జికి యీత వచ్చునా? ... అరే ఆ సంగతే అనుకోలేదు. జన్ని ఆలోచన వదిలి బుజ్జిని పట్టుకోబోయాడు. కాని బుజ్జి ఆ అయిదు గజాల్నీ పది గజాలు వేసి తొందరగా ఒడ్డు చేరాడు. రక్షించాలనే సద్బుద్ధివుంటే మాత్రం ఆ అవకాశం రానప్పుడు ఏంచేస్తాం? తప్పనిసరిగా జన్ని యీదుకుంటూ ఒడ్డు చేరాడు. కుట్టించి నెలయినా కాని టెర్లిన్ పాంటు బురదలో మునిగి ధ్వంసమయింది.

బుజ్జి తొందరగా యింట్లోకి పరిగెట్టాడు.

ప్రేమ వడ్డున నిలబడి విరగబడి నవ్వుతూంది.

జన్ని నెమ్మదిగా లేచి పైకి వచ్చాడు.

"ఎందుకలా నవ్వుతావు? మీ తమ్ముడ్ని రక్షించినందుకు కృతజ్ఞత చెప్పడం మానేసి." కోప్పడ్డాడు జన్ని.

"బావా.....", ప్రేమకి మాటలు రావడం లేదు. నవ్వుతూంది.

"బా..వా...యు..ఆర్..నీవు.. గ్రేట్ ... ఉహ్!... వండర్‌ఫుల్!... అబ్బ"... నవ్వు కెరటాలు వస్తూంటే మధ్యమధ్యన ఒక్కొక్క ముక్క బయట పడుతుంది.

జన్ని నీళ్లలో తడిసి ముద్దయి నున్నగా ముందుకి, కళ్ల మీదికి జారిన జుట్టు వంకా, చొక్కా, పాంటూకొసల నించి జారుతున్న బురదనీళ్ల వంకా చూశాడు.

ప్రేమ నవ్వు ఉప్పెన కాస్త తగ్గాక "బావా, నువ్వింత ప్లానుతో యిక్కడికి రావడం, స్నేహితుడి వంకబెట్టి విరహ బాధ బయటపెట్టడం, నన్ను యింప్రెస్ చేయ్యాలని, తమ్ముడ్ని నీళ్లలో తోసి, మళ్లీ బయటికి తీయాలనుకోడం ఓహ్, యింత లోతు మనిషివని కల్లోకూడ అనుకోలేదు. రోజుకో సినిమా చొప్పున చూస్తూంటే ఆ ఆలోచనలే రాకేమవుతాయి! మానమంటే మానవు!"

జన్ని అయోమయంగా చూశాడు.

"అసలు యింత తిప్పలు యెందుకు

బావా? నే నెలాగు సీదాన్నేగా" ప్రేమ చిన్నగా నవ్వుతూ దగ్గిరగా వచ్చి తడిసిపోయిన షర్టు బటన్లు విప్పింది. జన్నికి ఏమైంది, ఏమవుతూంది ఏమి అంతు చిక్కడంలేదు.

"నేనివాళ రాత్రి నాన్నతో చెప్పేస్తాను.! బావ పెళ్లికి తొందర పడుతున్నాడని. ఏం! లేకపోతే యీ యింటికి నిప్పంటించేసి ఆర్పాలని యెత్తేస్తావు రేప్పొద్దున్న?" జన్ని బుజాల మీద చేతులు వేసి తల అతని మెడ దగ్గిర ఆన్చి నవ్వింది ప్రేమ.

"నువ్విలా నా మీద ప్రాలిపోతూ, యింత చనువుగా హేళనగా మాట్లాడేవంటే, 'కాబోయే భర్తతో ఏ భారతస్త్రీ యింత అమర్యాదగ మాట్లాడదు, యిది హిందూ సాంప్రదాయానికి వ్యతిరేకం. హన్నా" అని చదివే వాళ్లకి రాసేవాడి మీద కోపం వస్తుంది. కాబట్టి అలా దూరంగా నిలబడి, కొంచెం మర్యాదగా మాట్లాడడం నేర్చుకో" జన్ని తొందరగా యింట్లోకి నడిచాడు, ప్రేమను తప్పించుకుని.

* * *

ఆ మర్నాడు పరం కనిపించాడు జన్నికి.

"నిన్న సాయంకాలము ఎక్కడ తగలడ్డావు?" నమిలి మింగేయాలన్నంత కసిగా ఉంది జన్నికి.

"ఏం చెప్పమంటావు? నిన్న ప్రేమ ఒక అమ్మాయిని తీసుకొచ్చింది.... పేరు తెలియదుగాని......"

"రత్నమాల"

"వ్వాట్ ఎ నేమ్?! ఏంపేరు! నిజంగా అలాంటి అందాన్ని ఎక్కడా యింతవరకు చూడలేదు. అసలు యింతకుముందు అంతటి అందానికి మానవులనర్హులనుకున్నాడేమో దేవుడు!"......

"యిప్పుడు నువ్వొకడివి వున్నావని గుర్తు చేసికొని...నీ కోసం పంపించాడు అవునా?.. సిల్లీ ఫెలో!....యింతకీ ఆమె ధ్యానంలోపడి నిన్నక్కడ హాజరవ లేదంటావు, అవునా?!"

"ధ్యానమేమిటి! మేమిద్దరం బర్న్స్ కవిత్వం గురించి చర్చించాం. ఏమన్నాడు బర్న్స్? 'నా ప్రేమ నవవసంతంలో నవ్విన లేత గులాబీ! నా ప్రేమ చక్కని బాణీలో తేలిన మధురగానం! ... నేను ప్రేమిస్తూనే వుంటాను యీ సముద్రా లింకిపోయేదాకా! యీ కొండలు ఎండకి కరిగిపోయేదాకా!.." పరం కవిత్వ ధోరణికి ఫుల్‌స్టాప్ కనపడడం లేదు.

"డామ్ యువర్ లవ్!.. నీవు.. నీ ప్రేమ. డామిట్!" శపించినట్టు అనేసి వెళ్లిపోయేడు జని. ●



# చూడచక్కనైన బిడ్డ-మావాడు

దుల్బారావు గవర్నమెంటు ఉద్యోగి. ఆదివారం వస్తే అతనికి పండగ. అతని భార్యకి ఏం చేతకాకపోయినా వంటలో మాత్రం అందెవేసిన చెయ్యి. ఆహార విషయంలో అతని అభిరుచులు ఎంత సున్నితమైనవయినా, ఆమె వంటకాల్లో ఒక్క లోటు అతను వేలుపెట్టి చూపలేదు. అంచేత ఆదివారం అతను మంచి కులాసాగా ఉంటాడు. కనక, ప్రత్యేకంగా తమ కోరికలేమన్నా ఉంటే, ఆనాటికి అట్టే పెడతారు, అతని భార్యా పిల్లలు.

ఫోటోకి పదేళ్ళు, ప్రొఫెసరు రామ్మూర్తి సర్కసు అప్పుడే వచ్చింది ఆ వూరికి. అది చూడాలని అతడి ఆత్రం. ఆ ఆదివారం ప్రత్యేకంగా చేసిన షిర్వాల్యో (ఒక వంటకం) తృప్తిగా భుజిస్తూ ఇల్లు ఎల్లా నడపాలన్న విషయంమీద సుదీర్ఘమైన ఉపన్యాసం యిస్తున్నాడు తండ్రి. అయితే షిర్వాల్యో రుచి చూస్తున్న తండ్రికి కోపం రాదని సాహసించి, ఫోటో తండ్రి దృష్టిని అతి చమత్కారంగా సర్కసు మీదికి మళ్లించాడు.

ఫోటో అన్నయ్య మోరో — అతనికన్న నాలుగేళ్లు పెద్ద, బుడతకీచు కాలేజీలో చదువుతున్నాడప్పుడే. తల్లి అప్పుడప్పుడిచ్చిన అణా బేడా జాగ్రత్తచేసి, ఇంట్లో ఎవరికీ తెలీకుండా, మొట్టమొదటి ఆటే చూచి వచ్చేశాడతను. అంచేత—సర్కసేమంత బాగా లేదని వూళ్లో అంతా అనుకుంటున్నారని చన్నీళ్లు జల్లాడు. తండ్రిని మంచిమాట చేసుకోడానికి మోరో ఇల్లా అంటున్నాడని ఫోటోకి తెలుసు. అతను గట్టిగా వాదించాడు.

అసలు ఈ చాత్రో, కార్లేకర్, తారాబాయి, సర్కసు లన్నిటికన్నా రామ్మూర్తి సర్కసు చాలా గొప్పదన్నాడు. ఇంకే సర్కసులో నన్నా తెల్ల ఎలుగుబంటి ఉందా? ఆపైన రామ్మూర్తికి జిరాఫీ ఉంది. దాని పొడుగు పదిహేడడుగులు. అదీగాక, చిలక మూడు చక్రాల సైకిలెక్కి స్వారీ చేస్తుంటే, దాని భుజాలమీద ఉడత ఎక్కుతుంది.

అతని చెల్లెలు మూంకూ, కళ్లప్పగించి వింటోంది. ఉత్సాహంగా అంది. "సర్కస్ చాలా గొప్పదై ఉండాలి. లేకపోతే వూళ్లో వాళ్ల నాన్న, దాన్ని మొదటి రోజు, మొదటి ఆటకే, ఎందుకు తీసుకెడతాడు ? ఈవేళ వాళ్ల పెద్దన్నయ్య దాన్ని మళ్లీ తీసుకెడుతున్నాడు తెలుసా ?" అనేసి పెద్దన్నయ్య వేపు మహా కోపంగా చూసింది.

దాంతో దుల్బారావు అభ్యంతరాలన్నీ పటాపంచలై పోయాయి. "సరే! సరే! ఇలాంటి చిలిపి సరదాలమీద డబ్బు దుబారా చెయ్యడమంటే నా కసహ్యం. మరి మీరంతా చూడాలని పట్టుదలగా ఉన్నారు. వద్దంటే మానుతారా ? ఒరే మోరో, పిల్లల్ని తీసకెళ్ళు. మీ అమ్మని కూడా" అన్నాడు.

"సరదా సంగతి అలా ఉంచండి." అంది అతని భార్య అమాయకంగా "కాని మన ఫోటో మహా చురుకైనవాడు. సర్కసులో విశేషాలన్నీ వాకబుచేసి అవన్నీ కంఠతా పట్టాడు."

ఈ పొగడ్త ఫోటోకి ఇబ్బందిగా పరిణమించింది. "నీ ముద్దుల కొడుకుని, నువ్వు ఇంతగా గారం చెయ్యబట్టే, నేను వాళ్ల టీచరు ముందు తలెత్తుకోలేకుండా ఉన్నాను. మన ప్రబుద్ధుడు ఏడాదయింది బుడతకీచు బడిలో చేరి. ఏసి సర్కసులో, ఎన్ని జిరాఫీలు, ఎన్ని ఉడత లున్నాయో, కంఠస్థమే గాని, గోవాలో పదకొండు పరగణాల్లోనూ, ఆరింటిపేర్లే తెలుసు నీ కొడుక్కి. నిన్న రోడ్డుమీద నన్నాపి మరీ చెప్పాడు వాళ్ల టీచరు. నీ ముద్దుల కొడుకు గెడక్కరలా ఎదిగి పోతున్నాడే గాని, వాడి బుద్ధి మాత్రం పెరగడంలేదు. వాడి పొట్ట వాడు పోసుకోలేడు. నాకు తెలుసు. వాడికి పెళ్లి అవాలంటే, చివరకు నువ్వు ఇంటింటికి పోయి, 'మా పిల్ల నిస్తారా ? మా పిల్ల నిస్తారా' అని బతిమాల వలసిందే— 'చూడ చక్కనైన బిడ్డ మావాడు' అని పాడుకుంటూ."

తండ్రి ఇలా ఎత్తి పొడిచేసరికి, మోరో, మూంకూ విరగబడి నవ్వారు. ఫోటో ముఖం ఎర్రబడింది. ముడుచుకు పోయాడు. తల్లి మూంకూ వంక తీక్షణంగా చూసింది. "ఆడపిల్లవి, ఎనిమిదేళ్లొచ్చాయి నెత్తిమీదికి, మంచీ, మర్యాదా తెలియక్కర్లే" అంది.

అయితే మూంకూ కులాసాని అరికట్ట లేకపోయింది. కిలకిల నవ్వులతో మేళాయించి సాగదీస్తూ పాటంతా పాడింది మూంకూ.

"చూడ చక్కనైన బిడ్డ మావాడు,
తాడిచెట్టు తాడులేక ఎక్కుతాడు.
పాడిగేదె లెనైనా కడుగుతాడు."

పాట పాడేసి, కొంటెగా తల్లివంక చూస్తూ, తండ్రిని గారంగా అడిగింది— "నాన్నా ! నాన్నా ! ఆ కుర్రాడి కథ చెప్పు నాన్నా. అలాంటి కథేదో విన్నట్టు జ్ఞాపకం. మరిచిపోయాను నాన్నా! చెప్పవూ ...." తల్లి ఆమెను మింగెయ్యా లన్నట్టు చూసింది. చూపులు మరో పక్కకి తిప్పేసింది మూంకూ.

ముగ్గురు పిల్లల్లోనూ మూంకూ అంటే మహా ముద్దు దుల్బారావుకి. కడసారి పిల్ల కనక, చిన్నతనం గడిచి పెళ్లీడు దగ్గర పడేసరికి ఆ ముద్దు మరీ ఎక్కు

వెళ్ళింది. ఆమె కొంటెతనం తెలిసి కూడా తెలియనట్టుగానే ఆమె వంక ఆప్యాయంగా నవ్వుతూ చూశాడు. "మాంకూ తల్లీ, కథ లంటే నీ కెంత ఇష్టమమ్మా. అందులో ఇల్లాంటి చమత్కారమయిన కథలంటే మరీను. విను చెప్తా"—అంటూ మొదలు పెట్టాడు.

"నీకుతెలుసో తెలీదో—మన గోవా బ్రాహ్మ ల్లోనే, మరో శాఖవాళ్ళున్నారు. మన సార స్వత బ్రాహ్మల్లాగ వాళ్ళు చేపలు తినరు. వాళ్ళ భాష చిత్రమయినది. కొంకణి, మహా రాష్ట్రం కలగాపులగం చేసి మాట్లాడు తారు. మాంసం తినకపోయినా, వాళ్ళలో చాలామందికి, చదువూ సంధ్యా రాదు. వ్యవ సాయం, దూడల పెంపకం, వాళ్ళ వృత్తి. చిత్ర మేమిటంటే, వాళ్ళల్లో మగవాళ్ళ కన్న, ఆడవాళ్ళు తక్కువ. అంచేత పిల్లా డికి పెళ్ళి కావాలంటే వాడి తల్లితండ్రులు దండిగా ఓలివ్వాలి.

"ఘోషా లేమయిందంటే, ఓ పిల్లాడి తల్లి పొరుగున ఉన్న ఓ ఆడపిల్ల తల్లి దగ్గరకు వెళ్ళింది పిల్లని అడగడానికి. తన బిడ్డ గుణగణాలను వర్ణించడం మొదలుపెట్టింది.

"చూడ చక్కనైన వాడు, మావాడు
తాడులేక తాడిచెట్టు ఎక్కుతాడు.
పాడి గేదె లెన్నైనా కడుగుతాడు."

అంటూ పాట పాడింది.

"పిల్ల తల్లికి ఇవన్నీ మనసు కెక్కలేదు. మొహాన్ని కొట్టినట్టు పాటలోనే సమా ధానం చెప్పింది.

"ఏడు నూర్లు ఇవ్వగల మగవాడు
వాడే నా చిన్నదాని మగ డవుతాడు
తాడిచెట్టు ఎక్కనీ—పాడి గేదె కడగనీ
పీడాపోయ నాకుమాత్రం పనికిరాడు."

"అయ్యో పాపం ఆ తల్లికి, పది గేదెల్ని కడగగల తన బిడ్డంటే, ఎంత గర్వమో" అంటూ వాపోయింది మాంకూ, తన తల్లివేపు ఓరగా చూస్తూ.

తన చిన్నారి చెల్లెలు ఎగతాళి చేస్తుంటే, ఫోటో ఇంక భరించలేక పోయాడు. తనకు ఆకలి లేదంటూ లేచిపోయి చేతులు కడిగేసు కున్నాడు, మజ్జిగ పులుసు కలిపిన అన్నం మహా కమ్మగా వాసన వేస్తున్నా. తల్లి అప్పుడే పట్టుకొచ్చింది పాపం మజ్జిగ పులుసు వడ్డించడానికి. ఆవిడ మనస్సు చివుక్కుమంది.

అయినా ఏమీ అనలేకపోయింది.

మాంకూ మాత్రం తను చేసిన పనికి వొచ్చుకోలేదు. ఫోటో పడుతున్న బాధ చాలా వరకూ నాటకమని ఆమెకు తెలుసు. అది గాక వాళ్ళమ్మ తన ముద్దుల కొడుక్కి ప్రత్యేకంగా ఆ సాయంకాలం ఎలాగా టిఫిన్ రెట్టింపు పెడుతుంది. తన అన్న గారూ తండ్రీ సరదాగా నవ్వడం చూసి ఆ భోజనాల రంగానికి మహా ఉత్సాహంగా భరతవాక్యం పాడింది.

"చూడ చక్కనైనవాడు మావాడు
తాడులేక తాడిచెట్టు ఎక్కుతాడు,
పాడిగేదె లెన్నైనా కడుగుతాడు."

రచయిత : వి. ఎస్. సుక్తాంకర్

అనువాదం : పాలగుమ్మి పద్మరాజు




'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4"×2", 4"×4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం||




తైమూర్ జైత్రయాత్రకు సన్నాహాలు చేస్తున్నాడు. మౌల్వీ నసీరుద్దీన్‌ని పిలిచి ఇల్లా అన్నాడు:

"మాతో నువ్వు కూడా బయలుదేరడానికి సిద్ధంగా ఉండు. తినడం, నిద్రపోవడము ఇక చాలించు. విల్లు వంచే రోజులు కాని, నాలుక వంచే రోజులు కావు. రేపు ఉదయమే ప్రయాణం."

మౌల్వీ తప్పించుకుందామని ఎంత ప్రయత్నించినా రాజుతో వెళ్లక తప్పేలా లేదు. ఎక్కడిదో పాత విల్లు ఒకటి చేతబట్టి, తన గాడిద నెక్కి, తైమూరు దగ్గరకు వచ్చాడు.

మౌల్వీ వాలకం చూచి తైమూర్ పకపక నవ్వేడు.

"ఏమయ్యా ! ఏమిటిది ? గుర్రం ఎక్కడా దొరకలేదా యుద్ధానికి గాడిదను తెచ్చేవు ?"

"దేవరా! ఈ గాడిద నన్ను పోనివ్వకుండా తానూ వస్తానని మొరాయించింది. మీ రాజుగారు నిన్ను విడిచి ఉండలేకపోతే, నేను నిన్ను విడిచి అంతకన్నా ఉండలేను. నువ్వు ఎక్కడికి వెడితే అక్కడికి నేనూ వస్తానని పట్టుపట్టింది." అన్నాడు మౌల్వీ.

మౌల్వీ వేళాకోళం పట్టిస్తున్నాడని తైమూర్ గ్రహించాడు. కాని, చుట్టూ ఉన్న వారికి ఈ సంగతి తెలియడం ఇష్టంలేక తానూ వేళాకోళ మాడేడు.

"సరే బాగుంది. కాని, నీ దగ్గర విల్లు ఒక్కటే ఉన్నట్లుంది, మరి బాణాలేవీ?"

"బాణాలు లేవు."

మరి శత్రువులను దేనితో కొడదామనుకొంటున్నావు ?"

"వాళ్లు మనమీదికి వేసే బాణాలే తీసుకుని మళ్లీ కొడతాను."

"ఓహో ! ఏమి తెలివి ? శత్రువు మనమీదికి అసలు బాణాలే వెయ్యకపోతే అప్పుడేంచేస్తావు ?"

"అప్పుడు అసలు యుద్ధమే మొదలు కాదు కదా, ఇంక నాకు బాణాలెందుకూ?"

మౌల్వీ నసిరుద్దీన్ కథలు

— శ్రీమహీధర్ నళినీ మోహన్




మౌల్వీ నసీరుద్దీన్ బాగా రాత్రి పొద్దుపోయాక ఇంటికి చేరుకున్నాడు. అతని కొడుకు—నెలల పిల్లవాడు— పోరు పెట్టి ఏడుస్తున్నాడు. ఎంతకీ నిద్రపోడు. ఏడుపుమానని పిల్లవాడిమీద, ఇల్లు పట్టకుండా తిరిగి ఆలస్యంగా వచ్చిన మగనిమీద అతని భార్య చిరచిర లాడుతోంది.

"వీడు ఇందాకటి నుంచి ఒక్క వరసని ఏడుస్తున్నాడు. వీడికి మందో, మంత్రమో వేయించి తీసుకువస్తావని నీకోసం ఎదురు చూస్తుంటే ఇప్పుడా యింటికి రావడం ?"

మౌల్వీ ఏమీ మాట్లాడలేదు. అలమారు తలుపు తెరిచి, అందులోనుంచి కొరాను బయటికి తీసి భార్యకి అందించాడు.

ఆమెకి బొత్తిగా అర్థంకాలేదు.

"ఇప్పుడు కొరాను ఎందుకూ ?"

"ఇప్పుడే కాదు, పిల్లాడు ఎప్పుడు ఏడ్చినా ఇది చదివి వాడికి వినిపిస్తూ ఉండు. వెంటనే కళ్లు మూసుకుని నిద్ర పోతాడు."

"అయ్యో తెలివా! కొరాను చదివితే పిల్లలు నిద్రపోవడం ఏమిటి ? ఎక్కడా వినలేదు."

"మసీదులో రోజా చూస్తూ ఉంగా నుగా. కొరాను చదవడం ప్రారంభించగానే అందరికీ ఒకటే కునికిపాట్లు" అన్నాడు మౌల్వీ. ●

# వారఫలం

**11-3-1966 శుక్రవారం మొదలు 17-3-1966 గురువారం వరకు.**

**మేషం :** మీరు క్షణం కూడా తీరుబడి లేకుండా ఎంతో కృషి చేస్తేనేగాని యే వ్యవహారంలోనూ అనుకూలతను సాధించలేరు. వ్యాపారంలో ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు వారాంతంలో సులువుగా నెరవేరతాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు అందగల సూచనలు ఉన్నాయి. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో ఋతరుల జోక్యంవలన నష్టం వస్తుంది. ఉద్యోగంలో మీరు చేయవలసిన ముఖ్యమైన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**వృషభం:** వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయిగాని, వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులు యేర్పడగల సూచనలు ఉన్నాయి. దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే భారీ వ్యవహారాల్లో మీ కృషి రాణించగలదు. వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆదాయం బాగానే ఉన్నా సమయానికి డబ్బు అందక ఇబ్బంది కలుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్ష సంచలనం పెరగడంవలన మీదే వెనుకకు తగ్గవలసి వస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. సంతానానికి అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వారాంతంలో మీ తాలూకు వస్తువులు పోగల సూచనలు ఉన్నాయి.

**మిథునం :** వృత్తి, వ్యాపారాల్లో ఆదాయంకంటే హడావుడి అధికంగా ఉంటుంది. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. కాని, భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రయోజనకరంగా ఉంటాయి. వృత్తిలో కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసిన అవసరం యేర్పడుతుంది. వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. ఉద్యోగంలో ఎవరితోనూ వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు. కోర్టు వ్యవహారాల్లో ఇదివరకు యేర్పడిన చికాకులు చాలవరకు తొలగిపోతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి సామాన్యంగా ఉంటుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు.

**కర్కాటకం :** కొన్ని వ్యవహారాలు సులువుగానే నెరవేరినా మరికొన్నింటిలో చాలా శ్రమ పొందవలసి వస్తుంది. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగారాభిస్తాయి. వృత్తిలో నూతనావకాశాల కోసం చేసే ప్రయత్నాల్లో కొంతమంది మిత్రుల సహకారం లభించగలదు. నూతన వ్యాపారాలు ఆకర్షణీయంగా కనిపించినా ఫలితం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడంవలన ముమ్ముందు ఇబ్బంది కలుగుతుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్తగల సూచనలు ఉన్నాయి. కుటుంబ కార్యక్రమాలకు అనుకోని మార్పులు వస్తాయి. శుభ మూలంగా వ్యయం జరుగుతూంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**సింహం :** మీరు కొంతమంది మిత్రుల మొగమాటాలకు లొంగిపోవడంవలన మీకు సంబంధంలేని వ్యవహారాల్లో చిక్కుకొనవలసి వస్తుంది. వ్యాపారంలో మీరు ఇదివరకు ప్రయత్నం చేసిన వ్యవహారాలు ఇప్పుడు సానుకూలపడగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అభివృద్ధిని సాధించగలరు. ఆర్థికంగా మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉన్నా, ఋతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించడంవలన సాటి వారిలో మీ శక్తి సామర్థ్యాలను రుజువు చేసికొనగలరు. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. విలాస వస్తువులు కొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పిస్తుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య :** అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉన్నట్లు కనిపిస్తాయిగాని, మీరు యేమాత్రం యేమరుపాటుగా ఉన్నా వృత్తివ్యాపారాల్లో ప్రయాసమీది, ప్రయోజనం మరొకరిది కాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో సాటివారితో పోటీ పెరగడం వలన మీరు పొందవలసి ప్రయోజనాన్ని పొందలేని పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ప్రయోజనం గల వార్తలను వింటారు. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహించవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో కొత్త సమస్యలు తల ఎత్తవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు వచ్చి సర్దుకొంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**తుల :** ఈవారం మీ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి. వృత్తిలో సాటివారితో యేర్పడిన పోటీ చాలావరకు తగ్గడంవలన మానసికంగా విశ్రాంతి లభిస్తుంది. వ్యాపారంలో మీకు నష్టం కలిగించడానికి ఋతరులు చేసే ప్రయత్నాలే లాభదాయకంగా మారగలవు. ఉద్యోగంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఆదాయంతో నిమిత్తం లేకుండా అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకూల వాతావరణంయేర్పడుతుంది. కోర్టు వ్యవహారాల్లో ప్రతికక్షుల వాదం బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**వృశ్చికం :** గతవారంకంటే యీవారం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో ఇదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మీరు మాట పట్టుదలలకు లొంగిపోవడంవలన చేజిక్కిన అవకాశాలను కూడా కోల్పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో మెప్పుకు రాని కార్యభారాన్ని వహిస్తారు. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తల ఎత్తవచ్చును. వారం మధ్యలో చేసే ప్రయాణాల్లో కొంత శ్రమ కలిగినా, తగిన ప్రతిఫలం లభించగలదు. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—స్వల్ప అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. శుభ కార్యాల విషయంలో మీ ఆలోచనలకు ఆటంకాలు వస్తాయి.

**ధనుస్సు :** ఈవారం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో వ్యయ ప్రయాసలకు గురి కావడంవలన తరువాత కొంచెం అభివృద్ధిని సాధించినా, యీవారం సంతృప్తికరంగా ఉండదు. వృత్తిలో మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు ఇప్పుడు ప్రాముఖ్యత రావడంవలన ఇబ్బంది కలుగుతుంది. వ్యాపారంలో ఋతరులమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. వృత్తి రీత్యా వారాంతంలో చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో బాధ్యతగల పాత్రను వహిస్తారు. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుటతగదు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :** వృత్తిలో యిదివరకు మీ యెడల ముభావంగా ఉన్నవారు కూడా యిప్పుడు మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో మీకు ముందు ముందు ఉపయోగించగల సంభాషణలను జరుపుతారు. వారాంతంలో అన్ని వ్యవహారాల్లోనూ చికాకులు యేర్పడతాయి. ప్రయాణాల్లో మీ తాలూకు వస్తువులు పోయే సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో యితరులు చేసిన పొరబాట్లవల్ల కూడా మీరే యిబ్బంది పడవలసి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కుంభం :** రావలసిన డబ్బు సమయానికి అందక పోవడంవలన యిబ్బంది కలిగినా, యేదో ఒకవిధంగా అన్ని వ్యవహారాలను సరిపుచ్చుకొంటూ, వారాంతానికి తగినంత అభివృద్ధిని సాధించగలరు. సాహసంతో కూడిన వ్యవహారాలు కూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాల్లో శ్రమమీద ఫలితం లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వస్త్ర వ్యాపారులకు, వైద్యులకు యోగవంతమైన సమయం.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధువుల వ్యవహారాల్లో అనుకూల వార్తలను వింటారు.

**మీనం :** మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉంటాయి గాని, కొంతమంది మిత్రులకు యిబ్బంది కల్గడం వలనమీరు కూడా చికాకులకు గురి కాగలరు. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. వృత్తిలో సాటివారి పోటీని ఎదుర్కొని అభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—మీ ఆరోగ్యం బాగా ఉంటుందిగాని, సంతానానికి అనారోగ్యం చేయవచ్చును. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్

# దొంగ



యస్. వివేకానంద

రావు సిగరెట్లు కాల్చటం తగ్గించాడు. సినిమాకు వెళ్ళి యే నెల రోజులో దాటింది. కాలేజీకి తప్ప కనీసం బైటి కెళ్ళటం కూడ మానేశాడు.

కాలేజి నుండి రాగానే గదిలో కిటికీ ప్రక్కనే ఉన్న మంచంమీద కూర్చుని వీధిలోకి చూస్తూ తీవ్రంగా ఆలోచిస్తూ ఉంటాడు. పొద్దు పోవటంలేదు అనుకుంటాడు. బైటకెళ్ళి రోడ్డుమీద తల ఎత్తుకు తిరగాలీ అంటే భయం. జేబులో కాస్త చిల్లరయిన లేకుండ వెడితే వెలితిగ ఉంటుందని ఎలాగో ఇంటి నాలుగు గోడల మధ్య కాలం వెళ్లబుచ్చుతున్నాడు రావు.

డబ్బు సంపాదన —ఎట్లా ?—రావు మస్తిష్కంలో మెదలాడే సమస్యలు ఇవే! పుష్కలంగ డబ్బు జేబునిండ ఉండాలని ఆశ—దాని వెనక తాను సంపాదించలేక పోతున్నాననే నిరాశ నిస్పృహ

కాలేజీ చదువు పూర్తికాకముందే తండ్రి రావుని ఒక ఇంటివాణ్ణి చేశాడు. ఇల్లరికం వచ్చిన రావు మామగారి దగ్గర చిల్లర డబ్బులు అడిగి తీసుకునేందుకు సంకోచపడుతున్నాడు. పిల్ల నిచ్చి ఇల్లరికం తెచ్చుకుంది చాలక అస్తమానం ఆయన్ను డబ్బుకోసం వేధించటం బావుండదనుకుంటూ ఉంటాడు.

అప్పులు—బైట కాలు పెడితే అప్పులు. ఉసుళ్ళకు మల్లే అప్పులవాళ్ళు వెంటబడతారనే భయం—అయితే ఎన్నాళ్ళిట్లా తప్పుకు తిరగటమానే ఆలోచనతో సతమత మవుతున్నాడు.

శ్రీమతి అయినా దగ్గరుంటే బావుండు అన్పించేది. మరో రెండు రోజులు గడుస్తేనే గాని మేనమామగారింటి నుంచి ఆమె రాదు.—రెండు రోజులు —ఎంత దారుణంగ గడవాలి —

సంపాదించటం మొదలుగాక ముందే తండ్రి తనను గృహస్థుడుగ చేసినందుకు నిత్యం మనసులో నిందిస్తూ ఉంటాడు. కనీసం భార్య అయినా ఏ ఉద్యోగమో చేసి సంపాదిస్తూ ఉంటే భర్త తనకున్న అవసరాలను గడుపుకుంటూ బాధలను తీర్చుకోవచ్చు. ప్రపంచలో ఎంతమంది భార్యలు సంపాదించి పెడుతుంటే, భర్తలు తింటూ కూర్చుని హాయిగ, ఆనందంగ రోజులు వెళ్లదీయటంలేదు.—పోనీ మామగారయిన, 'అయ్యో అల్లుడి దగ్గర డబ్బులున్నాయో

"లేవో" అని పరామర్శించి, ఆంతర్యం కనుక్కుంటూ సమస్యను పరిష్కరిస్తే ఎంత బావుండు, అని అంతరాంతరంలో వాపోతుంటాడు రావు.

భార్య వచ్చాక అయినా తనకు ఇన్ని అప్పులు, ఇబ్బందులు ఉన్నాయని చెప్పి డబ్బు సర్దుబాటు చేయమని అడగటం మాత్రం యేం భావ్యంగ ఉంటుం దన్పించింది. పైగా తన చేతగానితనానికి, అసమర్థతకు ఏమనుకుంటుందో ననేనే భయం మరోవైపు రావును పీక్కుతింటోంది.

అవసరాలు తీరే దెలాగో, సమస్యను ఏవిధంగ పరిష్కరించాలో అర్థంగాని రావు సతమత మవుతున్నాడు. పోనీ దొంగతనం చేస్తే? —అమ్మో —అలాంటి ఆలోచన రాగానే రావుకి వళ్లంతా చెమట పట్టింది. గుండె వేగంగ కొట్టుకో నారంభించింది. దొంగతనం చెయ్యకముందే ఇంత భయంగ ఉందే. తీరా ఆపని చేశాక 'హార్టు ఫేలవు' తుందేమోని భయపడ్డాడు.

'దొంగ' అనే పదానికి సమాజం యెంత దారుణమైన భయాన్ని ఏర్పరిచింది. అవసరాలు తీరక, తీర్చుకునే మార్గం కన్పించక మరోవిధంగ ఆపని నెరవేర్చుకుంటే వాడు దొంగ ఎట్లా అవుతాడు ?—పోనీ పట్టుబడితే దొంగ? అదీ న్యాయమే — కేవలం మరోవిధంగ అవసరం తీర్చుకున్నంత మాత్రాన దొంగగా పరిగణించటం అన్యాయంగా రావు మనస్సుకు తోచింది.

వేళకు ఫలహారాలకు లోటులేదు. టైం ప్రకారం అత్తగారు మరదలు ద్వారా తన గదిలోకి పంపుతునే ఉంది. అయితే మిగతా ఖర్చుల సంగతి మామగారికి చెప్పాలనుకుంటాడు. కానీ నోరు పెగిలి బైటకు మాట రాదు. అల్లుడు బజారయినా వెళ్లకుండ, ఇంటిపట్టున ఉండి చదువుకుంటున్నాడు గాబోలనే తృప్తితో నవ్వుకుంటున్నారు మామగారు.

పేక ఆడుకునేందుకయిన ఇంట్లో ఎవరూ లేరు. ఎంతసేపని మరదలుతో కేరమ్సు ఆడతాడు—అప్పటికీ పొద్దు పోవటానికి రేడియో పెడతాడు—నావల్సు చదువుతూ ఉంటాడు.

భార్య ప్రక్కన లేనందున, జేబులో డబ్బులేక బజారు పోనందున ఆంతా యాంత్రికంగ తయారైనట్లుగ ఉంది. —

వూరికి వెడుతూ శ్రీమతి పాపను గూడ తీసుకెళ్లింది. లేకపోతే పాపతోనైన కాస్త కాలక్షేపంగ ఉండేది. ఈ వారం రోజుల్లో పాప ఎంత పెద్దదయి ఉండవచ్చు అనే ఆలోచన రాగానే, రావు మనస్సులో పాపను చూడ్దా మనే దుగ్ధ బయల్దేరింది.

సాయంత్రం ఐదు గంటలు కావస్తోంది కాఫీ త్రాగటం ముగించిన రావు వాకిట్లో కొచ్చాడు. ప్రక్కనే ఉన్న చిల్లర కొట్లో బాకీచేసి వో సిగరెట్ పాకెట్ పుచ్చుకున్నాడు. సిగరెట్ మీద సిగరెట్ వెలిగిస్తు వాకిటి ముందున్న అరుగుమీద కూర్చున్నాడు.

దూరంగ కేకలు, అరుపులు విన్పించాయి. ఆలోచన్లకు అంతరాయం కలగటంతో రావు తల ప్రక్కకు తిప్పాడు. జనం పరుగెడుతూ 'పట్టుకోండి....పట్టుకోండి' అని అరవటం కళ్లబడ్డది. భయంతో పరుగెడుతూముందుకు దూసుకు వెడుతున్న వో ఆగంతకుడిని, అమాంతం ఎదురొచ్చే లావుపాటి మనిషి పట్టుకున్నాడు. వెనకాల పరుగెడుతున్న జనమంతా గుంపుగ వచ్చి చేరారు. తలా వక చెయ్యి వేశారు. ఆగంతకుడి వళ్లు హూనం కావటంతో నిరసంగ నడిరోడ్డుమీద పడిపోయాడు. చుట్టూ జనం తలా వక రకంగ కేకలు పెడుతు అరుస్తున్నారు.

అరుగుమీద కూర్చుని యిదంతా చూస్తున్న రావు లేచి జనం దగ్గర కెళ్లాడు. పోలీసులకు పట్టించమని కొందరు—చావగొట్టమని మరికొందరు అంటుంటే విషయ మర్థంగాని రావు ప్రక్కనే ఉన్న ముసలాయన్ను సంగతేమిటని అడిగాడు. అతనికి కూడ కారణ మేమిటో తెలియక 'అసలేం జరిగిందంటు' ఎదురు ప్రశ్న వేశాడు రావును.

అందరి మాటలు ఆకళింపు చేసుకునే సరికి రావుకు వో అరగంట పట్టింది. కేవలం దొంగతనం చేయబోయినంత మాత్రాన ఇంత దారుణంగ శిక్షించటం రావుకి బాధగ తోచింది. అతని పరిస్థితికి సానుభూతి చూపాలన్పించింది. చుట్టూ ఉన్న జనం పల్చబడ్డారు. దొంగ దీన స్థితి, దుర్భర అవస్థ చూచిన రావు 'నువ్వు దొంగవు కావు. పట్టుబడ్డందుకు దురదృష్టవంతుడివి' అన్నట్టు అతనికేసి చూచి ఇక అక్కడ నిలబడలేక ఇంట్లోకి దారి తీశాడు.

రాత్రి ఏడు గంటలు కావస్తోంది. ఇంటి ముందు బండి ఆగిన చప్పుడైంది. పంచలో ఈజీచైర్లో పడుకుని రేడియో వింటున్నాడు రావు. బైటి గేటు తోసుకుని పరుగెత్తుకుంటు వచ్చిన మరదలు రజని "బావా ! అక్క వచ్చేసింది" అనేసి ఇంట్లో కెళ్లింది. పడుకున్నవాడల్లా గభాలున లేచి ఎదురొస్తున్న శ్రీమతిని చూచి పరామర్శించినట్టుగ వో చిరునవ్వు విసిరి చంకలో ఉన్న పాపను చేతికి తీసుకున్నాడు. ప్రేమతో తల నిమురుతూ, గాఢంగ హృదయానికి హత్తుకుని తనివితీర పాపను ముద్దాడాడు రావు. వారం రోజుల తర్వాత తండ్రిని చూడగలిగానననే ప్రేమకొద్దీ తాతగారు పిలిచినా పోలేదు పాప.

భోజనా లయ్యాక అందరు ఒకచోట కూర్చుని కబుర్లోకి దిగారు. పాప తాతగారి వడిలో ఆడుకుంటోంది. శ్రీమతి అందించిన తాంబూలం నములుతూ ఆలోచిస్తున్న రావు దృష్టి అనుకోకుండ పాపమీద కేంద్రీకరింపవడ్డది. రావుకు పాపలో క్రొత్తదనం కన్పించటానికి కారణంగ పాప చేతిన బంగారపు గాజులు లైటు వెలుగులో తళతళ మెరుస్తున్నాయి.

'రాధా ! పాప చేతికి బంగారపు గాజులెక్కడివోయ్ ?—' శ్రీమతిని అడిగాడు తదేకంగ పాప చేతి గాజులకేసి చూస్తు.

రాధ సమాధానం ఏం చెప్పిందో రావు చెవికి సోకలేదు. వక్కమారుగ రావు ఆలోచనలు సుళ్లు తిరిగాయి. కళ్లు మిరిమిట్లు గొల్పేలా తళతళా మెరుస్తున్న పాప చేతి గాజులు రావు మస్తిష్కాన్ని, ఆలోచన్లను దూర తీరాలకు లాక్కెళ్లాయి.

'ఏమిటండీ అట్లా చూస్తున్నారు. దిష్టి తగిలేను.' అన్న రాధ మాటలు శూలాల్లాగ రావు గుండెను చీల్చివేశాయి. పాప నవ్వేసింది, ఏదో అర్థమైన దానికి మల్లే. రాధ మాటలకంటె పాప నవ్వు రావును భయపెట్టింది. పాప నవ్వుతునప్పటికీ తన దృష్టిలో బాధపడుతున్నట్లు, ఏడుస్తున్నట్టు అన్పించింది రావుకు.

పారాడుతూ వచ్చిన పాప రావు వడిలో కూర్చుంది. రావు మామూలు ప్రపంచంలోకి వచ్చాడు.

రాత్రి పది గంటలు దాటింది. రావు మంచం ప్రక్కనే మరో మంచంమీద రాధ పడుకుంది. తల్లి దగ్గర పాలు త్రాగుతున్న పాప కళ్ళు పెద్దవి చేస్తు లైటుకేసి చూస్తోంది. పాప రెండవ చెయ్యి తల్లి నడుంమీద వేసింది. రావు దృష్టి పాప చేతి వైపు మళ్లింది. వోమారు రావు గట్టిగ శ్వాస పీల్చి వదిలాడు.

ప్రయాణ బడలికతో వుంటాన రాధ నిద్రపోయింది.కాని రావు మేలుకునే ఉన్నాడు. పడుకున్నవాడల్లా లేచి లైటుతీసి మళ్లీ నడుంవాల్చాడు. రావుకి ఎంతకీ నిద్ర

# దొంగ

రాకుండ ఉంది. సిగరెట్ వెలిగించి ఆలోచనలను నెమరు వేస్తున్నాడు.

భార్యను డబ్బు సర్దమని అడగటమా ? —పాప చేతి గాజులు దొంగతనం చేసి అవసరం గడుపుకోవటమా ??—ఈ రెండు ప్రశ్నలే రావును వేధిస్తున్నయి.

పాప చేతి గాజులు దొంగిలించేందుకు తీర్మానించుకున్నాడు. తనే దొంగతనం చేశాడని ఎట్లా తెలుస్తుంది. ఎవ్వరూ అనుమానించరు. పైగ ఏ తండ్రీ అలాంటి దారుణమైన అఘాయిత్యానికి పాల్పడడు అనే సవ్యస్యతో విషయం తనదాక రాకుండనే సమసిపోతుంది.

చేతికి గాజులు ఉన్నా, లేకపోయినా వాటి ఆనందం పసిపాపకేం తెల్సు. గాజులు చేతిన లేనందున బాధ అంతకన్నా పాప కర్సంగాదు..... కాని పాప అమాయక హృదయం తనను శపిస్తుందేమో? తనవైపు దోషిగ చూస్తూ హేళన చేస్తుంది పాప నేరస్తుడిలాగ అసహ్యించుకుంటుంది. పాపకు విషయం తెలిస్తే తనకు దూరంగ ఉంటుంది—కానీ —పాపకు తనెలా దూరం కాగలడు? —తప్పు ఒప్పుకున్నా పాప తనను క్షమించదు. నాన్న దొంగ అని అందరితో చెప్పుకుంటుంది. అది తను సహించలేడు. ఈవిధంగ పాప తనకు దూరం కావటం ఇష్టంలేదు.

దొంగగా తయారైన తను పాపను ఏముఖంతోదగ్గరకు తీసుకోగలడు.తెల్లవారితే అందరూ తననే అనుమానిస్తారు. తను తల ఎత్తుకు యెట్లా తిరగడం ?— వెంటనే సాయంత్రం జరిగిన సంఘటన కళ్లల్లో మెదిలింది. పరాయివాడు గాబట్టి వాడిని కొట్టగలిగారు. సంవత్సరమైనా నిండని పసిపాపకు ఇవ్వన్నీ ఏం తెలుసు, తన పిచ్చి గాని! అనుకున్నాడు.

చెమట పట్టిన ముఖాన్ని తుడుచుకున్నాడు. లేచి గదిలో లైటు వేశాడు. రాధ పక్కలో నిద్రపోతున్న పాపను తెచ్చి తన పక్కమీద పడుకోబెట్టుకున్నాడు. లైటు ఆర్పి వచ్చి మంచంమీద పడుకున్నాడు రావు.

కిటికీలోంచి వచ్చే చల్లగాలికి రావు ఆలోచనలు కుదుటబడ్డయి. కళ్లు మూసుకు పడుకున్నాడు.

బరువుగ తెల్లవారింది. రాధ వచ్చి రావును నిద్ర లేపింది. కళ్లు తెరిచి చూచిన రావుకి పక్కలో పాప కన్పించలేదు.

'రాధా! పాపేది?—' ఆదుర్దాతో అడిగాడు.

'పాప ఎప్పుడో నిద్ర లేచింది. మీరే తొమ్మిదింటికి లేస్తున్నారు. నిద్రలేవటంలో అమ్మాయికి మీ పోలిక రాలేదులెండి.'

హమ్మయ్య అనుకొన్నాడు. శ్రీమతి అందించిన టూత్ బ్రష్ తీసుకున్నాడు. లేచి వెళ్లి అద్దంముందు ముఖం చూసుకుంటు 'ఇంతకూ అనుకున్న పని పూర్తికాకుండానే తనకు అంత నిద్ర ఎట్లా ముంచుకొచ్చింది. చెప్మా' అనుకున్నాడు స్వగతంలో.

స్నానం ముగించి వాకిట్లో కుర్చీలో కూర్చుని ఆడుకుంటున్న పాపను, చేతి బంగారపు గాజులను చూచి తృప్తిగ నవ్వుకున్నాడు. క్రితం రాత్రి నిద్ర తనను అంతగ ఆవరించినందుకు మనసులో మరోమారు తిట్టుకుని, కనీసం ఈ రాత్రికయినా ఆపని కాస్త ముగించాలని తీర్మానించుకున్నాడు. పాపను దగ్గరకు తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు.

భోజన కార్యక్రమం ముగించి కాలేజికి బయల్దేరాడు. క్లాసులో కూర్చుని లెక్చర్లు వింటున్నాడన్న మాటే గాని రావు ధ్యాస మరోవైపుకు లాగుతోంది. క్లాసు లెప్పుడవుతాయా, ఎప్పుడెప్పుడు చీకటి పడుతుందా అనే ఆలోచన తప్ప మరో ఆలోచనే లేదు. పుస్తకం తెరిచినా, పాఠం వింటున్నా పాప చేతి బంగారపు గాజులె కళ్లల్లో సుళ్లు తిరుగుతున్నయి.

మనస్సు బాగోనందువల్ల మధ్యాహ్నం క్లాసులు మానేసి సరాసరి యింటికి దారి తీశాడు. త్రోవలో పాప బంగారు గాజుల భవిష్యత్‌మీద కొన్ని కొత్త ప్లానన్ని నిర్మించుకుంటు నడుస్తున్నాడు రావు.

గుమ్మంలో అడుగు పెట్టేసరికి రావులో క్రితం క్షణం వరకు మెదలాడుతున్న ఆనందానికి సంకెళ్లు పడ్డట్టయింది. రావును చూచిన అత్తగారు, మామగారు వకరి ముఖాలు మరొకరు చూచుకని తలలు దించేసుకున్నారు. రజని భయంతో బిత్తరి చూపులు చూస్తు నిలుచుండిపోయింది. రాధ

ముఖం చూపించలేక రివ్వున – ఇంట్లోకి వెళ్లింది.

పరిస్థితేమిటో అర్థంగాని రావు నివ్వెర పోయాడు. ఓ క్షణంసేపు ఆలోచించాడు. ఒకరి ముఖాలు మరొకరు చూచుకోవటం మినహా అతనికేమీ అర్థంగాలేదు.

ఒక్క అడుగులో ఇంట్లోకెళ్లి తలుపు ప్రక్కనే ఉన్న రాధను 'ఏం జరిగింది రాధా?' అడిగాడు రావు.

కేవలం ముఖాన్ని ప్రక్కకు తిప్పుకోవటం తప్ప అంతకన్నా ఏం చేయలేకపోయింది రాధ. రాధ కంటిలో నీరు నిండటం గమనించిన రావు 'అసలేం జరిగిందో ఎవ్వరూ చెప్పరేం?'— విసుక్కున్నాడు.

వరండాలో నుంచి వస్తున్న అత్తగారు 'ఆఁ.... ఇంకేముంది బాబూ, పాప చేతి బంగారపు గాజులు కాస్తా పోయాయి....' అంది.

'ఆఁ .... ఎట్లా పోయాయి ??—'

ప్రక్కనే ఉన్న మామగారు 'ఏం లేదు నాయనా, రజని పాప నెత్తుకుని వాకిట్లో పాపను ఆడిస్తున్నదల్లా మీ అత్త గారు రజనిని పిలవగానే పసిదాన్ని అరుగ్గ మీద కూర్చోబెట్టి లోపలి కొచ్చింది. పాప ఏడ్పు విన్పించి రాధ వాకిట్లో కెళ్లి పసిదాన్ని చంకనేసుకుని ఇంట్లోకి తెచ్చింది. తీరా ఇంట్లో కొచ్చాక చూచుకుంటే ఏముంది, పాప చేతిగాజుల్లేవు—ఇదంతా జరిగి గంట కూడ కాలేదు. మేమంతా వంచలోనే ఉన్నాం పైగా—' అన్నారు.

'అరి రాస్కెల్ ! పసిపాప చేతి గాజులు దొంగిలించేందుకు వాడికి చేతులెట్లా వచ్చాయి ?' అనేసి నోటి కొచ్చినట్లల్లా తిట్టాడు రావు కసికొద్దీ. రావు మాటల్లో, కన్న కూతురి సొమ్ము పోయిందనే బాధ తనకు దక్కకుండా పోయాయనే ఈర్ష్య మిళితమయినయి.

'ఆఁ. దొంగతనం చేయదల్చుకున్న వెధవకు చిన్నా, పెద్దా, భేద మేమిటయ్యా. ఇంతకీ మనకా సొమ్ము ప్రాప్తంలేదు.' అనేదో గొణిగారు అత్తగారు.

అదే పని రావు చేసివుంటే అత్తగా రన్న మాటలు తనకే వర్తించి ఉండేవిగదా అనే భయం, కన్నబిడ్డ చేతి గాజులు పోయాయనే బాధతో మానసికంగ కృంగి పోయాడు. ●



# హైదరాబాద్ ఫిలిం పరిశ్రమ

ఈమధ్య ఒకసారి హైదరాబాద్ వెళ్ళాను. తెలుగు ఫిలిం పరిశ్రమలోని అతిరథులను, మహారథులను కలుసుకోవటం, ఆంధ్ర రాజధానిలో తెలుగు సినీ పరిశ్రమ పొందుతున్న వికాసాన్ని పరిశీలించటం—ఇవే నా ప్రయాణంలోని ముఖ్యోద్దేశాలు.

సారథి స్టూడియో స్థాపనతో ప్రారంభమయిన 'తెలుగు దేశంలోనే తెలుగు సినిమా' ఉద్యమం రోజురోజుకూ క్రొత్త రూపులు సంతరించుకుంటూ అభివృద్ధి పథకంలో పురోగమిస్తున్నదని చెప్పక తప్పదు. మొట్టమొదట ఒకే స్టూడియో, ఒకే ఫ్లోర్‌తో ప్రారంభించబడిన హైదరాబాద్ సినిమా పరిశ్రమ, నేడు సకల సదుపాయాలు కల రెండు స్టూడియోలు, నిర్మించ తలపెట్టిన మరో రెండు స్టూడియోలు, (1. దర్శక నిర్మాత—శ్రీ ఎల్. వి. ప్రసాద్ గారిది, 2. ప్రముఖ హిందీ దర్శకుడు శ్రీ కమల్ అమ్రోహి గారిది.) ప్రస్తుతం ఉన్న రెండు స్టుడియోల విస్తరణకు రచించిన బృహత్ ప్రణాళికలు రూపొందించుకుంటున్నది. ప్రస్తుతం మన స్టూడియోలలోకల ఫ్లోర్స్ అన్నీ తెలుగు, కన్నడ, మలయాళ చిత్రాల షూటింగ్స్‌తో క్షణం కూడా విరామం లేకుండా పనిచేస్తున్నాయి.

## శ్రీ సారథి

శ్రీ సారది స్టూడియో—సి.ఏ.పి. అండ్ విజయ చాముండేశ్వరి పిక్చర్సువారి 'నవరాత్రి', ఆత్మా ఆర్ట్స్ వారి 'చిలుకా—గోరింకా', ఈమధ్యనే షూటింగ్ ప్రారంభించిన జగపతి వారి 'ఆస్తిపరులు' మొదలగు చిత్రాల కార్యక్రమాలతో సందడిగానే ఉంది. ఇందులోని రెండు ఫ్లోర్సు నిర్విరామంగా పనిచేస్తున్నాయి. చిత్ర నిర్మాణానికి కావలసిన సకల సౌకర్యాలు యిందులోనే అమర్చి పెట్టారు శ్రీ సారధి అధినేతలు. రెండు పెద్ద ఫ్లోర్సు, ఒక థియేటరు, లాబరేటరీ, అత్యాధునికమైన రికార్డింగ్ ఎక్విప్‌మెంటు, విశాలమైన మేకప్ రూమ్స్, నటీనటులకు వసతి సదుపాయాలు, యివన్నీ యీ స్టూడియోలోనే ఉన్నాయి. ఈమధ్యనే మరో క్రొత్త ఫ్లోర్‌కు శంకుస్థాపన కూడా జరిగింది. ఈ స్టూడియో ఆవరణ చూస్తే మరో నాలుగు ఫ్లోర్స్, రెండు థియేటర్లు కూడా నిర్మించవచ్చు ననిపించింది.



## సదరన్ మూవీటోన్

ఆంధ్ర రాజధానిలో వెలసిన రెండవ స్టూడియో సదరన్ మూవీటోన్. దీని విస్తీర్ణము ఇరువైమూడు ఎకరాలు. ప్రస్తుతం రెండు ఫ్లోర్సు రాత్రింబగళ్ళు పనిచేస్తున్నాయి. లలిత శివజ్యోతివారి రంగుల చిత్రం 'రహస్యం', కె. ఏ. పిక్చర్సువారి 'మహాసతి అరుంధతి', రవిచంద్రావారి 'ఎర్ర గులాబి' మొదలైన తెలుగు చిత్రాలేకాక, కన్నడ, మలయాళ చిత్రాలు కూడా ఇందులో నిర్మించబడుతున్నాయి. ప్రస్తుతం నిర్మించబడుతున్న మరో రెండు ఫ్లోర్సు, నిర్మించబడ్డ రెండు ఫ్లోర్సు, నిర్మాణానికి సిద్ధంగా ఉన్న మరో ఆరు ఫ్లోర్సుకి చూస్తుంటే, మదరాసులో విజయా—వాహిని స్టూడియోస్ తరువాత స్థానం దీనికే దక్కవచ్చుననిపిస్తుంది. సువిశాలమైన ఆవరణ, ఆవరణలో నవాబుల 'హవేలీ' లను పోలే రెండు చక్కని భవంతులు చిత్ర నిర్మాణానికి ఎంతో సదుపాయంగా ఉన్నాయి. ఇవిగాక రెండు థియేటర్లు, ఆధునిక పరికరాలతో అమర్చబడిన లాబొరేటరీలు కూడా నిర్మించబడుతున్నాయి. ఈ స్టూడియోను అభివృద్ధి పరచడంలో స్టూడియో అధినేతల



'[illegible]వనం' లో బి. సరోజాదేవి, దేవిక

## [illegible] ఆసక్తి అభినందనీయం
## ఎన్. టి. ఆర్. ఎస్టేట్స్

స్టూడియోల సందర్శన ముగిసిన తర్వాత ఎన్. టి. ఆర్. ఎస్టేటు చూడటానికి వెళ్లాము. హైదరాబాద్ నగరానికి హృదయం వంటి 'ఆబిడ్స్' లో ఉన్న ఎన్. టి. ఆర్. ఎస్టేట్స్ రెండున్నర ఎకరాల స్థలాన్ని ఆక్రమించింది. ఇందులోనే 'రామకృష్ణ 70 మి. మీ' థియేటరు, 'రామకృష్ణ 35 మి. మీ' థియేటరు (రెండూ పూర్తిగా ఎయిర్ కండిషన్డ్) నిర్మింపబడుతున్నాయి. రాబోయే వినాయకచవితి నాటికి 70 మి. మీ థియేటరు ప్రారంభించాలని శ్రీ ఎన్. టి. రామారావు నిర్ణయం. ఉత్తమ సాంకేతిక నైపుణ్యంతో నిర్మింపబడుతున్న యీ థియేటరులో 1270 మంది ప్రేక్షకులకు అవకాశముంది. రెండు బాల్కనీలు ఉన్నాయి. ఈ ఎస్టేటు ఆవరణలోనే 96 దుకాణాలకు సరిపోయే వసతిగల నాలుగు అంతస్తుల భవనం, విశాలమైన కారు పార్కు కూడా ఉన్నాయి. మద్రాసులో ఉండి కూడా హైదరాబాద్ అభివృద్ధికి ఇతోధికమైన చేయూత నిస్తున్న శ్రీ ఎన్. టి. రామారావు ప్రశంసనీయులు.

## శ్రీ అక్కినేని
### హైదరాబాద్ ఫిలిం పరిశ్రమకు పునాది

తరువాత శ్రీ అక్కినేని నాగేశ్వరరావును కలుసుకోవటం నా తదుపరి కార్యక్రమం అయింది. శ్రీ నాగేశ్వరరావును సదరన్ మూవీటోన్ స్టూడియోలో కలిశాను. చిరునవ్వుతో ఆయన మాట్లాడుతూంటే ఎంతవారైనా సమ్మోహితులు కాక తప్పదేమో అనిపించింది. 'అంతదూరం నుండివచ్చి మా ఆతిథ్యం స్వీకరించకుండా వెళ్తారా' అని బలవంతపెట్టి వారి యింటికి తీసుకు వెళ్ళారు.

శ్రీ నాగేశ్వరరావు నివాసం బేగంపేటలో ఉంది. బేగంపేటలో రాజభవనంలా కనిపిస్తున్న ఒక యింటిలోనికి కారు జొరబడింది. విస్తృతమైన ఆవరణలో ఒక చిన్న కొండ, ఆ కొండపై మూడు అంతస్తుల పెద్ద భవంతి ఇరవైఏడు సంవత్సరాలకు పూర్వం నవాబులచే కట్టబడినా కూడా, నేటి అభిరుచులకు సరిపోయే హంగులన్నీ ఆ భవంతిలో ఉన్నాయి. విశాలమైన ఆవరణలో ఒక వైపు పిల్లలకు పార్కు, మరో వైపు కోళ్ల పెంపకం, మరోవైపు పూతోట, తమ పశువులకు కావలసిన గడ్డి పొలాలు, కూరగాయల తోటలు, పశువులపాక ఇవన్నీ చూస్తుంటే శ్రీ నాగేశ్వరరావు, మన మాజీ ప్రధాని శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి చెప్పినట్లు గృహావసరాల విషయంలో స్వయం సమృద్ధిని సాధించగలమనుకున్నట్లు అనిపిస్తుంది.

శ్రీ నాగేశ్వరరావు యీ మధ్య క్షణం తీరిక లేకుండా చాలా బిజీగా ఉన్నారు. ఒక షూటింగ్ కార్యక్రమం ముగిసీ ముగియక మునుపే రెండవ దానికి తయారవుతుంటారు. హైదరాబాద్ లో ఫిలిం పరి



'ఆత్మగౌరవం' చిత్రంలో కాంచన.

# ఫిలిం పరిశ్రమ

(శ్రమ మూడు పువ్వులు; ఆరు కాయలుగా విలసిల్లుతున్నదంటే దానికి శ్రీ అక్కినేని నిర్విరామ కృషేగా కారణం!

## ప్రభుత్వమిస్తున్న చేయూత

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు కూడా తెలుగు సినిమా పరిశ్రమాభివృద్ధికి యితోధికంగా సహాయపడుతూనే ఉన్నారు. అప్పులు, గ్రాంటులు, సబ్సిడీలు మొదలైన వాటితో ప్రోత్సాహిక చిత్ర నిర్మాతలకు, స్టూడియో నిర్మాతలకు ప్రోత్సాహ మిస్తున్నారు. ఈ వివరాలు తెలుసుకునేందుకు సమాచార, పౌరసంబంధ కార్యాలయ అధికారులను కలుసుకున్నాను. ఎంతో సహృదయంతో వారు నాకు కావలసిన సమాచారమంతా తెలియజేశారు. రాజధానిలో నిర్మించిన ఏ భాషా చిత్రానికైనా యాభై వేల రూపాయలు సబ్సిడీ యిస్తున్నారు రాజధానిలో స్టూడియోల అభివృద్ధి కోసం ప్రస్తుతం ఉన్న స్టూడియోలకి అప్పు, కొత్తగా నిర్మించ తలపెట్టిన స్టూడియోలకు తక్కువ వడ్డీకి ఋణాలు యివ్వటమే గాక, స్థలము కూడా యిస్తున్నారు. ప్రతి సంవత్సరం ఉత్తమ తెలుగు చిత్రాలకు, దర్శకులకు, రచయితలకు నిర్మాతలకు బహుమతులు అందజేస్తున్నారు. గత సంవత్సరం బహుమతుల ప్రదానోత్సవం స్వాతంత్ర్య దినోత్సవంనాడు జరిపారు డాక్టర్ చక్రవర్తి, కీలుబొమ్మలు గుడిగంటలు — చిత్రాలు బహుమతులు అందుకున్నాయి. హైదరాబాద్‌లో నిర్మించిన అయిదు చిత్రాలకీ యాభై వేల రూపాయల వంతున సబ్సిడీలు ప్రభుత్వం అందజేసింది హైదరాబాద్‌లో నిర్మించిన యితర చిత్రాల నిర్మాణ వివరాలు నిర్మాతలను ప్రభుత్వం కోరుతుంది ఆ వివరాలు అందిన వెంటనే వాటికి కూడా సబ్సిడీలు ప్రభుత్వం అందజేస్తుంది



దైవశాసనంలో శివాజీగణేశన్,
బి. సరోజదేవి.



నటి గీతాంజలి (ఫోటో: మాణిక్యత్యాగరాజన్)

1965 లో సెన్సార్ అయిన చిత్రాలకు యీ సంవత్సరం తెలుగు సంవత్సరాదినాడే బహుమతి ప్రదానోత్సవము జరుప నిశ్చయించింది ఆంధ్ర ప్రభుత్వం. ఈ సంవత్సరం పదిహేను చిత్రాలకు పైగా పాల్గొంటున్నాయి గత సంవత్సరం లాగే యీ సంవత్సరం కూడా బంగారు, వెండి, కంచు నంది విగ్రహాలు ఒక్కొక్కటి 2,500 గ్రా. బరువు కలవి, మెమెంటో, నగదు బహుమతులు కూడా యివ్వబడతాయి. వరంగల్లుకు నలభై మైళ్ల దూరంలో గల రామప్ప దేవాలయంలోని నంది యీ విగ్రహాలకు మూలం.

## బొంబాయి నిర్మాతల రాక:

ప్రముఖ రచయిత, నిర్మాత, దర్శకుడు అయిన శ్రీ కె. ఏ. అబ్బాస్ హైదరాబాదులో 'ఆస్మాన్ మహల్' హిందీ చిత్రం పూర్తిగా ఔట్‌డోర్‌లో పూర్తి చేయడం, అటువంటి ప్రఖ్యాతి గల నిర్మాతలు హైదరాబాద్‌లో చిత్రాలు నిర్మించడానికి ముందుకు రావడం ఆనందదాయకం

హైదరాబాద్‌లో ఫిలిం పరిశ్రమకు మంచి భవిష్యత్ కలదని, చక్కటి ఫిలిం పరిశ్రమ కేంద్రం కాగలదని ఆశించవచ్చు

—ధర్మాజీ

# సినిమా వార్తలు

## రష్యన్ కాన్సులేట్ జనరల్ శ్రీ కావెరిన్ ప్రారంభించిన తెలుగు చిత్రం

సీతారామాంజనేయ పిక్చర్సువారు తొలి సారిగా సాంఘిక చిత్రాన్ని ప్రారంభించారు ఈ చిత్రానికి 'సంగీతలక్ష్మి' అని నామకరణం చేశారు

ఈ చిత్రం షూటింగు యోవమధ్య వాహినీ —విజయా స్టూడియోలో లాంఛనప్రాయముగా పూజచేసి ప్రారంభించారు విజయా అధినేత శ్రీ బి నాగిరెడ్డి పూజ చేశారు ప్రముఖ తెలుగు, తమిళ, హిందీ చిత్రాల దర్శకులు శ్రీ తాతినేని ప్రకాశరావు క్లాప్ కొట్టారు రష్యన్ కాన్సులేట్ జనరల్ శ్రీ కావెరిన్ స్విచ్ ఆన్ చేశారు రామారావు, జమునలతో మొదటి చిత్రీకరణ చేశారు ఈ సెట్టులో దాదాపు వారం రోజులు షూటింగు జరిగింది

ప్రారంభోత్సవానికి శ్రీయుతులు చక్రపాణి, పి పుల్లయ్య, టి చలపతిరావు, తాపీ చాణక్య, బాలయ్య మొదలగువారు హాజరైనారు

ఈ చిత్రంలో ఎన్ టి రామారావు, ఎస్ వి రంగారావు, రమణారెడ్డి, నాగభూషణం, రాజబాబు, ప్రసాదరావు, జమున, నిర్మల, ఎల్ విజయలక్ష్మి, సూర్యకాంతం మొదలగువారు నటిస్తున్నారు.

శ్రీ పి. సుబ్బారావు సమర్పిస్తున్న యీ చిత్రానికి నిర్మాత శ్రీ సి. నరసింగరావు రష్యాలో కొన్ని సంవత్సరాలు ఉండి మాస్ స్టూడియోలో సహాయ దర్శకుని తర్ఫీదు పొంది, భారత సంస్కృతిని తెలిపే కొన్ని ప్రదర్శన లిచ్చిన శ్రీ గిడుతూరి సూర్యం యీ చిత్రదర్శకుడు ఈ చిత్రానికి కథ కూడా శ్రీ సూర్యం వ్రాశారు చరిత్రలో రష్యన్ కాన్సులేట్ జనరల్ తెలుగు చిత్రానికి ప్రారంభం చేయుటం యిదే తొలిసారి

సంభాషణలు ఆచార్య ఆత్రేయ వ్రాశారు శ్రీ ఎస్ రాజేశ్వరరావు సంగీత దర్శకత్వం వహిస్తున్నారు కళ—రాజేంద్రకుమార్

## పొట్టి ప్లీడరు ఏప్రిల్ లో విడుదల

రేఖా అండ్ మురళీ ఆర్ట్సు బేనర్ తో హాస్యనటుడు పద్మనాభం రెండవ చిత్రాన్ని సాంఘికంలోనే పూర్తిచేస్తున్నారు 'పొట్టి ప్లీడరు' అని నామకరణం చేశారు ఈ చిత్రానికి మూలం శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ వ్రాసిన 'ఇదేమిటి ?' నాటకం

ఈ చిత్రాన్ని డిశంబరు 10 వ తేదీన ప్రారంభించారు ఈ నెలలో షూటింగ్ పూర్తి అవుతుంది ఈ చిత్రంలో మొత్తం ఏడు పాటలు ఉన్నాయి మూడు పాటలు రికార్డింగ్ చేసి చిత్రీకరణ జరిపారు మరో నాలుగు పాటలు చిత్రీకరణ చేయాలి. రికార్డింగ్ చేసి ఉన్నాయి. పాటలు శ్రీ శ్రీ, కొసరాజు, వీటూరి, దాశరథి, ఆరుద్ర, అప్పలాచార్య, రాజశ్రీ వ్రాశారు. సంగీతం కోదండపాణి నిర్వహిస్తున్నారు

ఈ చిత్రంలో కథానాయకుడు శోభన్ బాబు, నాయిక గీతాంజలి శీర్షిక పాత్ర పద్మనాభం నిర్వహిస్తున్నారు ఇంకా ఈ చిత్రంలో ముక్కామల, రమణారెడ్డి, పెరుమాళ్లు, రావికొండలరావు, ప్రభాకరరెడ్డి, బాలకృష్ణ, పేకేటి, వెంకన్నబాబు, వాణిశ్రీ, నిర్మల మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి నిర్మాత బి పురుషోత్తం, దర్శకత్వం కె హేమాంబరధరరావు.

## 'ఆడబ్రతుకు' 100 వ రోజు

జెమినీవారు 'ఆడబ్రతుకు' చిత్రాన్ని ఆంధ్రప్రదేశ్ లో విడుదల చేశారు విజయవంతంగా విజయవాడ, విశాఖపట్నం, విజయనగరం, గుంటూరు, నెల్లూరు, రాజమండ్రి, తెనాలి కాకినాడ, తణుకు, భీమవరం లో ఆ పది కేంద్రాలలో 100 రోజులు ప్రదర్శింపబడింది

విజయవాడ లక్ష్మి టాకీసులో 100 వ రోజు పండుగ అతి వైభవంగా గత నెల 19 వ తేదీన ఉదయం 9—30 గం లకు జరిగింది ఈ ఉత్సవానికి యీ చిత్రంలో నటించిన నటీనటులు, జెమిని అధినేత యీ చిత్ర దర్శకుడు శ్రీ ఎస్ ఎస్ వాసన్ హాజరైనారు

## 'వీర పూజ' రికార్డింగ్ తో ప్రారంభం

విజయసారధి ప్రొడక్షన్సు వారు తొలి



'సంగీతలక్ష్మి' ప్రారంభోత్సవ సందర్భంలో ఎల్. విజయలక్ష్మి, నిర్మల, చక్రపాణి, జమున, నాగిరెడ్డి, ఎన్. టి. రామారావు, తాతినేని ప్రకాశరావు, కేవేరిన్ (రష్యన్ కాన్సులేట్ జనరల్,) కె. వి. రెడ్డి, నర్సింగరావు, రమణారెడ్డి, గిడుతూరి సూర్యం (దర్శకుడు) కె. ఎస్. రెడ్డి, సుబ్బన్న, రాజేంద్రకుమార్.

సి రీగా "విరిసిన - అనే - జానపద చిత్రాన్ని ప్రారంభించారు. విజయా—వాహినీ స్టూడియోలో గత నెల 28 వ తేదీని పూజచేసి రికార్డింగ్ చేశారు.

ఈ ప్రారంభోత్సవానికి శ్రీయుతులు కాంతారావు, లింగమూర్తి, బాలయ్య, కుమారి కాంచన, కొంతమంది — ప్రముఖులు హాజరైనారు.

'కొనుమా ! పరాగమాల!
విలచేను నీదు ప్రేమాల! కొనుమా"

## సినిమా వార్తలు

పై యుగళ గీతాన్ని శ్రీ సినారె వ్రాశారు. ఘంటసాల, సుశీల పాడారు. ఈ పాటను కాంతారావు, కాంచనలో చిత్రీకరిస్తారు.

ఇంకా-యీ చిత్రంలో, పద్మశ్రీ నాగయ్య, బాలయ్య, లింగమూర్తి, రేలంగి, బాలకృష్ణ, వాసంతి, జి. వరలక్ష్మి, మొదలగు వారు నటిస్తారు.



'లోగుట్టు పెరుమాళ్ళకెరుక'లో రాజశ్రీ

సంగీతం : శ్రీ ఘంటసాల నిర్వహిస్తున్నారు. నిర్మాత : పోలవరపు కేశవులు చౌధురి, దర్శకత్వం : అమంచర్ల శేషగిరి రావు.

## 'అర్ధరాత్రి' చిత్రానికి మరో రెండు పాటలు

హైదరాబాద్ మూవీస్‌వారు ప్రారంభించిన 'అర్ధరాత్రి' చిత్రానికి మరో రెండు పాటలు యీమధ్య విజయా గార్డెన్స్‌లో రికార్డింగ్ చేశారు.

'దయచేయాలి, దయచేయాలి ....
ప్రియతమ స్వాగతము... .'

పై పాటను ఎల్ ఆర్. ఈశ్వరి పాడగా రికార్డింగ్ చేశారు.

'ఎగిరిపోయిన చిలుక . .
ఎచట వాలునో ఎవరి కెరుక '

పై పాటను సీర్కాళి గోవిందరాజన్ పాడగా రికార్డింగ్ చేశారు ఈ చిత్రానికి సంభాషణలు — పాటలు శ్రీ ఆరుద్ర వ్రాశారు. సంగీత దర్శకత్వం శ్రీ వేణు నిర్వహిస్తున్నారు.

నిర్మాత : పి గంగాధరరావు దర్శకత్వం పి సాంబశివరావు.

## 'మహాసతి అరుంధతి' ప్రారంభం

కె. ఎ. పిక్చరువారు హైదరాబాద్ సరదన్ మూవీటోన్‌లో 'మహాసతి అరుంధతి' చిత్రాన్ని ప్రారంభించారు. ఈ చిత్రానికి సంబంధించిన మూడు పాటలను, ఒక పద్యాన్ని మదరాసు రేవతి స్టూడియోలో ఈమధ్య రికార్డింగ్ చేశారు పాటలు : డా. సి. నారాయణరెడ్డి వ్రాశారు సుశీల, లీల, జానకి పాడారు. పద్యం శ్రీ సదాశివ బ్రహ్మం వ్రాశారు పి బి. శ్రీనివాస్ పాడారు సంగీత దర్శకత్వం అశ్వత్థామ వహిస్తున్నారు.

గత నెల 25 వ తేదీన సరదన్ మూవీటోన్‌లో ప్రారంభమయిన మొదటి షెడ్యూల్‌లో పద్మశ్రీ నాగయ్య, గుమ్మడి అంజలీదేవి, ఉదయకుమార్, గిరిజ పాల్గొన్నారు.

ఈ చిత్రానికి కథ, మాటలు . మహారథి వ్రాశారు. నిర్మాత జి కృష్ణారావు, దర్శకుడు : సి. ఎస్. రావు.

## ఎన్. టి. ఆర్ దంపతులకు పుత్రోదయం

మహాశివరాత్రి అందరికీ ముఖ్యమైన పండుగ. అదేరోజున మధ్యాహ్నం శ్రీమతి

రామినీడుగారికి స్థానిక నర్సింగ్‌హోంలో పుత్రోదయం కలిగింది. అయిదవ రోజున తల్లిని, చిరంజీవిని ఇంటికి తీసుకు వచ్చారు. తొమ్మిదవ రోజున ఊయలలో వేశారు. చిరంజీవికి 'జయశంకర్ కృష్ణ' అని నామ కరణం చేస్తారని తెలుస్తున్నది.

## 1966 లో జూనియర్ రామినీడు

'మా ఇంటి మహాలక్ష్మి' చిత్రం విడుదల అయిన తర్వాతనే శ్రీ రామినీడు అందరికీ తెలిసిందని కలిసివెలుగులు. చివరకు మిగిలేది, అనురాగం చిత్రాలు విడుదలయిన తర్వాత శ్రీ రామినీడు అంటే ముక్కోటి ఆంధ్రులకు చెప్పలేనంత అనురాగం ఏర్పడింది. ప్రత్యక్షంగా రామినీడును చాలమంది చూడకపోయినా, పేరు మాత్రం ప్రతివారి హృదయాల్లోను ముద్ర వేసుకుంది. శ్రీ రామినీడు కృషిని తెలిపే చిత్రం 'పల్నాటి యుద్ధం' ఈమధ్యనే విడుదలయింది. ఖడ్గతిక్కన, ఖడ్గతిక్కన వంటి చరిత్రాత్మక చిత్రాల దర్శకత్వం ప్రస్తుతం వహించి, చరిత్రను సృష్టించుకుంటు న్నారు తన కృషిని యితరులకు నేర్పించాలనే శ్రీ రామినీడు తన సహదర్శకులకు, సహాయ దర్శకులకు నోర్పు, నేర్పుతో దర్శకత్వ విషయాలు చెబుతూ ఉంటారు.

శ్రీ రామినీడుకు ముగ్గురు అమ్మాయిలు ఇంతవరకు ఆయన వృత్తిని అభ్యసించే వారసుడు లేరనుకున్నాం. గత నెల 23 వ తేది బుధవారం తెల్లవారుఝామున శ్రీమతి రామినీడు గారికి స్థానిక నర్సింగ్‌హోంలో జూనియర్ రామినీడు జన్మించాడు. ఆరోజు శ్రీ రామినీడు కుటుంబానికే గాక వారి మిత్రు లందరికీ ఒక పర్వదిన మయింది.

## చలనచిత్రాలలో హాస్యానికి మూలపురుషుడు కస్తూరి శివరావు అస్తమయం

కస్తూరి శివరావును తెలియనివా రుండరు. 'గిడిగిడి' అంటే చాలు—లేదా 'ఎలమంద' అన్నా శివరావుకు మారు పేరన్నమాట శివరావు పుట్టింది 1913 సంవత్సరంలో కాకినాడలో. కాకినాడ, విశాఖపట్నంలలో విద్యాభ్యాసం చేశారు. చదువుతూ మూగ చిత్రాలకు తర్జుమా చేసి వ్యాఖ్యానం చేసేవారు. సినిమా బోర్డులు వ్రాసేవారు టిక్కెట్లు అమ్మే వారు. మూకీ చిత్రాలు ప్రదర్శన వేళలలో హార్మోనియం వాయిస్తూ నేపథ్య సంగీతం ప్రేక్షకులకు అందించేవారు. రాజమండ్రి, అనకాపల్లి, మదరాసు నగరాలలో సినిమా ఆపరేటరుగా పనిచేశారు. శ్రీ కాళ్లకూరి సదాశివరావు ద్వారా 'చింతామణి' తో వెండి తెరకు పరిచయ మయారు. రాజా శాండో గారి 'చూడామణి' చిత్రంతో శివరావును హాస్యనటుడుగా ప్రజలు గుర్తించారు బాలరాజు, ముగ్గురు మరాటీలు, మాయల మారి, స్వప్నసుందరి, లైలామజ్ను చిత్రాలు ఎనలేని ఖ్యాతి తెచ్చాయి. 'గుణసుందరి' లో కథానాయకుడుగా నటించాడు. ఓసారి శివరావు ఎక్కిన రైలు సూళ్లూరుపేట దగ్గర ప్రమాదానికి గురైంది. శివరావు మరణించాడన్న వార్త అన్ని పత్రికలు ప్రకటించాయి కాని శివరావు పదిలంగా ఉన్నాడు.

'ఎలైడ్ ప్రొడక్షన్' అను పేరుతో, శివరావు డిస్ట్రిబ్యూషన్ ఆఫీసులు మద్రాసు హుబ్లి, రంగూన్ యీ మూడు కేంద్రాలలో నడిపారు. సుమారు ముప్ఫై చిత్రా లలో నటిస్తూ, డిస్ట్రిబ్యూషన్ ఆఫీ సులు చూసుకుంటూ, 'పరమానందయ్య శిష్యులు' చిత్రం నిర్మించారు ప్రొడక్షన్ స్వయంగా చూసుకున్నారు. ఈ చిత్రంలో ఒకపాత్రను పోషిస్తూ, దర్శకత్వంవహించారు. ఈనాడు పేరులో ఉన్న తారాగణం ఆ చిత్రంలో నటీనటులు. కొంతమంది సాంకేతిక నిపుణులను కూడా తొలిసారి ఆ చిత్రం



'దైవశాసనం'లో బి. సరోజాదేవి.



"ప్రేమించి పెళ్లిచేసుకో"లో రాజన్, పుష్పలత.

ద్వారా పరిచయం చేశారు శివరావు. చిత్రం నిర్మించే రోజుల్లో ఎటువంటి సౌకర్యాలూ లేని స్టూడియోలో యీ చిత్రాన్ని నిర్మించారు. దీనితో నటుడు, నిర్మాత, దర్శకుడు, పంపిణీదారుడు అన్న ఖ్యాతి శివరావుకు ఒక్కరికే దక్కింది.

రాజమండ్రి సన్మానసభలో కీ. శే. భమిడి పాటి కామేశ్వరరావు గారు 'వికటకవి' 'ఆంధ్రా చార్లీ చాప్లిన్' అను బిరుదులిచ్చి గౌరవించారు. గుంటూరులో జాషువా కవి, విజయనగరంలో ప్రముఖ తర్క శాస్త్రవేత్త శ్రీ పేరంకి అప్పలస్వామిగారు సువర్ణహస్త ఘంటా కంకణం బహూకరించి సన్మానించారు. శివరావుకు ఎన్నో సన్మానాలు జరిగాయి. ఎందరో అభిమానులు ఉన్నారు. మొన్నటి వరకు ఆంధ్ర దేశములో మూల మూలల నాటకాల ప్రదర్శన లిచ్చేరు.

అటు నాటకరంగంలోను, యిటు వెండి తెరపైన శిఖరాగ్రానికి చేరుకున్న శివరావు కొన్ని మాసముల నుండి అస్వస్థతగా ఉన్నారు. వైద్య సౌకర్యానికి తెనాలి వెళ్ళి అక్కడ స్వర్గస్థులయారు.

వీరికి నలుగురు అమ్మాయిలు, ముగ్గురు అబ్బాయిలు ఉన్నారు.

# సినిమా వార్తలు



'పరమానందయ్య శిష్యులు కథ'లో శోభన్‌బాబు

## "పరమానందయ్య శిష్యులకథ"

శ్రీ దేవి ప్రొడక్షన్సువారు ఈ మధ్య వీనస్ స్టూడియోలో మరో మూడు రోజులు తమ చిత్రం 'పరమానందయ్య శిష్యులు కథ' షూటింగ్ జరిపారు.

దొంగల నాయకుడు చిత్రలేఖను తీసుకు వచ్చి గుహలో నిర్బంధించడము, దొంగల నాయకుడు చిత్రలేఖను వివాహమాడ టానికి సిద్ధపడటం, నందివర్ధన మహా రాజు పురోహితునిగా ఆ గుహలోనికి ప్రవేశించి, చిత్రలేఖను కాపాడటం మొద లైన దృశ్యాలు చిత్రీకరించారు. నంది వర్ధన మహారాజుగా రామారావు, చిత్రలేఖగా కె. ఆర్. విజయ, దొంగల నాయకుడుగా సత్యనారాయణ పాల్గొన్నారు. మరి కొంత మంది దొంగల ముఠా కూడా ఉన్నారు. ఈ చిత్రాన్ని ఉగాదికి విడుదల చేయాలని నిర్మాత శ్రీ తోట సుబ్బారావు నిర్ణయం.

ఇంకా ఈ చిత్రంలో పద్మశ్రీ నాగయ్య, ముక్కామల, పద్మనాభం, ఎల్. విజయ లక్ష్మి, శోభన్‌బాబు, ఛాయాదేవి, రాజనాల, చంద్రమౌళి, మోదుకూరి సత్యం, అల్లు రామలింగయ్య మొదలగువారు నటిస్తున్నారు.

రచన : సదాశివబ్రహ్మం, సంగీతం : ఘంటసాల, దర్శకత్వం : సి. పుల్లయ్య

—ధర్మాజీ ●

# పుస్తకాలు

## విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు

రచయిత: కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, క్రౌను 224 పుటలు. వెల: 4 రూ. సర్వోదయ పబ్లిషర్సు, విజయవాడ—2.

హాస్యరస ప్రధానమైన యీ నవలలో సంస్కృతంలో పంచతంత్రాన్ని రచించిన విష్ణుశర్మా, ఆంధ్ర మహాభారతాన్ని తెనిగించిన తిక్కన మహాకవి మొదట కలల్లో ఒక ఆంధ్రాధ్యాపకునికి కానరావడం, మరి కొద్ది దినాలకు యథార్థంగానే కనబడి, ఆయన యింట్లోనే బస చెయ్యడం, ఆ ఉపాధ్యాయుడు విష్ణుశర్మకు ఇంగ్లీషు చెప్పడానికీ, తిక్కనకు ఉద్యోగం యిప్పించడానికీ ప్రయత్నించడం, విష్ణుశర్మ తన ఇంగ్లీషు గురువుకు వంటచేసి పెడుతూ వుండడం, తిక్కన ఊరు తిరుగుతూ ఉండడం, తిక్కన మూలంగా ఉపాధ్యాయుడు ధనం సంపాదించి తన గృహకృత్యాలకు ఉపయోగించుకోవడం యిందులోని ప్రధాన విషయాలు! ప్రారంభంలో కొంత విసుగుగా వున్నట్లు తోచినా చదివిన కొద్దీ ముందు చదవాలనే తోస్తుంది. కథాంశం లేకపోయినా రచనా వైదగ్ధ్యం, వివిధ సన్నివేశాల సంఘటనా, విమర్శన పద్ధతి, సంభాషణా క్రమం అన్నీ పాఠకుని రంజింపచేస్తూ ఉంటాయి.

కవిసామ్రాట్ యీ పాత్రద్వయం మూలంగా తెలుగుదేశంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ, విద్యాది పరిస్థితులనూ, మానవుల వివిధ ప్రవృత్తులనూ చక్కగా చిత్రించారు. ఈ కాలపు చదువులూ, పట్టభద్రుల యథార్థ స్థితి, అధ్యాపకుల యొక్కయు విద్యార్థుల యొక్కయు కాలేజీలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ ఉన్న భాషా శాఖాధ్యక్షుల యొక్కయు కుప్రవృత్తులూ నిర్మొగమాటంగా విమర్శింపబడినవి. విష్ణుశర్మ అంతవానిని తమ యింట్లో పాచకునిగా నియమించినట్లు వర్ణించడం వల్ల, సంస్కృత విద్వాంసులకు మనవాళ్ళు ఎట్టి గౌరవమిస్తున్నదీ వ్యక్తం చెయ్యబడినది. తిక్కన వంటి మహాకవి ఉపన్యాసం ఇవ్వడానికి సిద్ధపడి చక్కగా పద్యం చదివితే, అది సినిమా బాణీలో లేదనే కారణంతో గోలచేసి, ఆయనను మాట్లాడనీయకుండా చెయ్యడం విద్యార్థులలోని అవిధేయతకు మచ్చుతునక. బడిపంతుళ్ళ ఆర్థిక పరిస్థితి, దయనీయ స్థితి, సామాన్య మానవుల సంకుచిత తత్త్వాలూ, నాయకుల తీరులూ హృదయానికి హత్తుకునేటట్లు చూపబడినవి. విష్ణుశర్మ ఇంగ్లీషు భాషాభ్యాసం మూలంగా ఆంగ్లభాష యొక్క అసమగ్రతా, నాలుగు రకాల లిపులూ, ఉచ్చారణకూ, వ్రాతకూ సంబంధమనేది లేకపోవడం, ఇతరాలయిన లోపాలూ విష్ణుశర్మ విమర్శల మూలంగా వ్యక్తపరచబడినది. వాస్తవానికి ప్రతిభాషలోనూ ఏవో కొన్ని లోపాలుగా కానవస్తవి. ఇంగ్లీషులో వలెనే తమిళంలకి కూడా వ్రాతకూ, ఉచ్చారణకూ సంబంధం తక్కువ. తెలుగులో వ్రాత క్లిష్టమైనది. ఈలాగున ఇతర భాషల్లో కూడా లోపాలు కనబడతవి. అలవాటును బట్టి లోపాలుగా కానరాకుండా అవి సర్దుకుపోతాయి. ఈ విషయం రచయితకు ఆంగ్లభాష యెడల గల చులకన భావం వ్యక్తం చేస్తుంది. దేశంలోని వివిధ పరిస్థితులను జనసామాన్యానికి బోధపడేటట్లు చెయ్యడానికి ఇట్టి నవలలు మంచి సాధనాలు. మామూలు ఉపన్యాసాల కన్నా, ఇవే జనులకు మిక్కిలి ఆకర్షించి, వారి మనః ప్రవృత్తులను మార్పుటకు అనుకూలంగా ఉండగలవు.

—అంగీరస.

## మల్లెలు

మాలకట్టినది: కరుణ, ప్రచురణ దేశీబుక్ డిస్ట్రిబ్యూటర్స్, శరత్ బిల్డింగ్సు, విజయవాడ—2.

ఉత్సాహవంతులైన అయిదుగురు విద్యార్థుల యువ రచనల సంకలన మీ పుస్తకం. అయిదుగురు కథకులకూ గూడా, "మంచి పుస్తకాలన్నా మంచి నేస్తాలన్నా ఎంతో యిష్టం." తమ మున్నుడి 'సాంత జన్యంలో' ఈ రచయితలు 'కథలు వ్రాయడం కూడా యిష్టమే చదవడంతో పాటు. ఇష్టమైన పనులు కష్టమైనా చేయడానికి వుత్సాహంగా వుంటుంది గనుక కష్టపడ్డా కథలు వ్రాయగలిగాం' అంటారు. ఈకథలు కథాసాహిత్యంలో నిలిచిపోయేవనికానీ, లేక రచయితలుగా తమను నిలబెడతాయని కానీ వారు అనుకోవడంలేదు. తమను గురించి తాము "మా స్థాయి ఏమిటో మాకు తెలుసు. అంత మాత్రాన మా మీద మాకు నమ్మకం లేకపోలేదు. మేం బాగా వ్రాస్తాం. ఇంకా మంచివి, యింకా బాగా వ్రాసేందుకు ముమ్మరంగా ప్రయత్నిస్తాం." అని కూడా నిర్మొహమాటంగా వ్రాసుకున్నారు. ఇలాంటి వినయసంపదా, ఉత్సాహశక్తీ, చిత్తశుద్ధీ వున్న ఈ చిరంజీవులు తప్పకుండా అచిరకాలంలోనే ఆంధ్ర కథా ప్రపంచంలో ఉన్నత స్థానాన్ని అందుకోగలరు, రచనా వ్యాసంగాన్ని రాగద్వేష రహితంగా, ఒక తపస్సుగా సాగిస్తే.

ఈ సంకలనంలో శ్రీ రామకృష్ణ కథలు మూడూ, శ్రీ భాస్కర్ కథ ఒకటీ, శ్రీ రామచంద్రం వ్రాసిన కథ ఒకటీ, శ్రీ నళినీరంజన్ వ్రాసిన కథ ఒకటీ, శ్రీ దివాకర్ వ్రాసిన కథలు మూడూ, మొత్తం తొమ్మిది కథలున్నాయి. కథకులలో ఏ ఒక్కరికీ ఇరవై సంవత్సరాల ప్రాయం దాటని కారణంచేత వారు చూచిన ప్రపంచం ఏ విధంగా వుంటుందో ఎవరైనా తేలిగ్గా వూహించుకోవచ్చు. రామకృష్ణ కథల్లో వ్యంగ్యం, ఉల్లాసం, కావ్యతత్వం కొల్లలుగా కన్పిస్తున్నాయి. ముగింపులో విచిత్ర సన్నివేశం చిత్రించబడే 'ఓ హెన్రీ' పద్ధతి ఇతనికి అలవడినట్లు కన్పిస్తున్నది. భాస్కర్ రచనలో మానవతాదృష్టి కన్పిస్తున్నది. రామచంద్రం రచనలో చిలిపితనం, అమాయకత్వం కలగలిసిపోయినాయి. నళినీ రంజన్ భావుకుడు. కథను చక్కగా మొదలెట్టి మళ్ళీ ముడివిప్పగల శక్తి అతని దగ్గర పుష్కలంగా వుంది. దివాకర్ కథలు కన్నీటి జడివానకూ, అవహేళనకూ ఉదాహరణలు.

'అల్ప జీవితానుభవంతో వ్రాసినవి కనుక యీ కథల్లో దోషాలు వుండి వుండవచ్చు' అని కథకులే సందేహపడుతున్నారు. 'ఆకాశం తెల్లబోయింది' అనే కథలో పూడిపెద్ది పురుషోత్తం అనే ఓ కవిమర్శకుణ్ని పరిచయం చేస్తారు శ్రీ రామకృష్ణ. కానీ కథ మొదలుపెట్టినప్పటి నుంచీ 'రాధి'ని గురించీ, ఆమె భర్తను గురించి ప్రస్తావన బహుళంగా జరగడం వల్ల పురుషోత్తం తన శిష్యుడిగా ప్రకటించుకొంటున్న కె. రాధామాధవరావు ఎవరో, సమగ్రం స్పష్టా



రష్యాకేంద్ర కమ్యూనిస్టు పార్టీ పత్రిక 'ప్రావ్దా' ప్రతినిధులు శ్రీయుతులు బలేగ్ బి. స్కార్కిన్, యూరిగాట్ లోబర్, ప్రావడా భారతదేశ ప్రతినిధి ఐడోర్ డి. ఫొర్ట్రబయాకొవ్ తమ బృందంతో యిటీవల విజయవాడ "ఆంధ్రపత్రిక" కార్యాలయాన్ని సందర్శించారు.

## హస్తకౌశలం

చేయగల పాఠకుడయినా ముందే వూహించుకోగల్గుతాడు. అట్లాగే 'సదుపస్త్రం' చరిత్ర అన్న కథలో పూర్వార్థంలో గంగాధరాన్ని విప్లవ దేశభక్తుడిగా చూపెట్టి, భారతదేశ స్వాతంత్ర్యానంతరం అతడే వచ్చి స్వార్థపరుడిగా మారినట్లు చిత్రించటంవల్ల పాత్రచిత్రీకరణం దెబ్బతినడమే కాకుండా, కథలో ఐక్యత కూడా దెబ్బతిన్నది. చరిత్ర వెనక్కి నడుస్తోందని కథ చివరలో చేసిన సూచన గంగాధరం పాత్రను వెడగొట్టకుండానే, అతని చుట్టుప్రక్కల వాతావరణం కలుషితమైనట్లు చూపెట్టి, సాధించవచ్చును. 'జ్ఞాతృత్వంలో' నేటి విద్యార్థి మనసులో కలుగుతున్న సంఘర్షణను, ప్రేమ దృశ్యంతో ముడిపెట్టి, విషాదాంతం చేయాలని పట్టుబట్టినట్లు కన్పిస్తున్నది. కథలో బలం లేకపోయింది. కథనం బాగున్నది. 'అన్వేషణ' భిక్షువుల గాథ. వారికీ ఆశలూ, కోర్కెలూ, ఒక జీవనవిధానమూ వుంటాయని కరుణరస ప్రధానంగా చిత్రితమైన కథ. 'లక్ష్మి' పరీక్షాధికారులు డబ్బు తీసుకుని మార్కులు వేస్తారని తెలియజెప్తున్నది. ఇట్లా కథలు వ్రాసే ముందు అమాయకులయిన చదువరులపై ఈ రకం రచనలు ఎటువంటి దుష్ప్రభావాలు కలగజేస్తాయో రచయిత ఆలోచించుకోవాలి. వర్గ కలహాన్నికాక సామరస్యాన్ని, సౌభ్రాతృత్వాన్ని ప్రోత్సహించాలి రచయితలు. దివాకర్ వ్రాసిన 'గుణం' ఏ సంకలనంలో నయినా వుండదగిన లక్షితమైన గల్పిక. అహింస పేరుతో హింస చేసే మనఃప్రవృత్తికొక చక్కని 'పేరడీ' వంటిది. ఈ సంకలనం శ్రీ ముళ్ళపూడి వెంకటరమణకు అంకితమీయబడింది. కథలనూ, కథకులనూ పరిచయం చేస్తూ వారి శైలిలో శ్రీ సంజీవదేవ్ 'తానం' వ్రాశారు. అయిదుగురు కథకులూ భాషా ప్రయోగాల విషయంలో సంయమనం చూపి వుండవలసిందని సంజీవదేవ్‌గారు చెప్పివుండవలసింది. అయినా అందమైన పుస్తకం చేతిలో వున్నప్పుడు ముళ్లల ప్రక్కన దాగిన గడ్డిపూలను ఎవరు ఏరుతారు?

—శ్రీ రామచంద్రమూర్తి

## మహాభారతం

రచన : విశ్వప్రసాద్, కిరణకుమారి, నారాయణరెడ్డి. 664 పేజీలు. మూల్యం : అయిదు రూపాయలు. ప్రాప్తిస్థానం : భగవాన్ పబ్లికేషన్స్, మద్రాసు—24.

పంచమ వేదమని ప్రసిద్ధి గాంచిన మహాభారతాన్ని ఎందరో కవులు పద్య, గద్య రూపాల్లో తెనిగించారు. కానీ పద్యంలో తెనిగింపబడినవన్నీ గ్రాంధిక భాషలో ఉండి సామాన్య ప్రజలకు సులభంగా అర్థమయ్యేవికావు. వ్యావహారిక భాషాయుగం ప్రారంభం అయిన తర్వాత మహాభారతాన్ని యిద్దరు రచయితలు వ్యావహారిక భాషలో రూపొందించారు. వాటికీ మంచి ప్రజాదరణ లభించింది. అలాగే యీ ముగ్గురు రచయితలూ అందరికీ అర్థం అయ్యే వ్యావహారిక భాషలో మహాభారతాన్ని నవలా రూపంగా రచించారు.

మహాభారత కథ తెలియనివారుండరు కాబట్టి కథను వివరించ నవసరంలేదు. తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి అన్న సామెత ఉండనే ఉంది. అలాంటి ఈ మహాభారత రచనలో రచయితలు ముఖ్యమైన వాటిని కొన్నిటిని విస్మరించటం, వారికొన్నిచోట్ల ఒకటికిరెండుసార్లు చెప్పి వదిలేయటం వలన చదువరికి అసంతృప్తి కలిగేఅవకాశం ఉంది. రచయితలు యింకా కృషి చేసి, ఆ లోటుని భర్తీ చేసి ఉంటే అత్యుత్తమంగా ఉండేది. వ్యావహారిక భాషలో నవలా రూపంగా రచింపబడిన యీ గ్రంథంలో కొన్నిచోట్ల గ్రాంధికాన్ని ఉపయోగించటం జరిగింది. ఏమైతేనేం అందరికీ అర్థం అయ్యే రీతిగా యీ గ్రంథాన్ని రూపొందించిన రచయితలు అభినందనీయులే!

ప్రచురణకర్తలు తమ 200వ ప్రచురణగా మహాభారతాన్ని ఎన్నుకుని ముద్రించటం ముదావహం. వీరు యికముందు కూడా యిలా పౌరాణికాలన్ని నవలా రూపంలో ప్రచురించి మంచి రచనల్ని ఆంధ్ర పాఠక లోకానికి అందిస్తారని ఆశింపవచ్చు.

—మాధవ్

* * *

శ్రీ తంగెళ్ళ పాండురంగశర్మ రచించిన 'గులాబీ బాలలు' పిల్లల నవల మా కార్యాలయం చేరింది. జాతీయ భావాలతో పిల్లలకు అర్థమయ్యే రీతిగా సరళమైన భాషలో ఈ నవల రూపొందించబడినది. రచయిత ఈ నవలలో బాలల కర్తవ్యాన్ని చక్కగా ప్రబోధించారు. 68 పేజీల గల ఈ పుస్తకం ఖరీదు రూపాయిన్నర. కాపీలకు శర్మా పబ్లికేషన్స్, 10/70 పార్కురోడ్, విజయవాడకి వ్రాయాలి.

## ఒకనాడు

శ్రీ విద్వాన్ విశ్వం రచన. క్రౌను 18+84 పుటలు. మేలు కాగితము. చక్కని అచ్చు, వెల 2.50, ప్రాప్తిస్థానం: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు.

ఒకనాడు అంటే 1893 సంవత్సరము. అక్టోబరు 4వ తేదీనాడు గుత్తి సమీపంలో జరిగిన ఒక విషాదసంఘటన ఈ చిన్న కావ్యంలో చక్కగా చిత్రింపబడినది. రైల్వేగేటు కాపలా కాస్తున్న హంపన్న అనే యువకుడు నాగులమ్మ, లక్ష్మమ్మ అనే యిద్దరు యువతుల మానం కాపాడుటకై తెల్ల సిపాయిలతో పోరాడి, ఒకసిపాయి గుండు దెబ్బకు ఎరయైన ప్రాణం తన్నూ, అలజడిని విని చుట్టుపక్కల వారంతా రాగా సిపాయిలు పారిపోయి ఆ యువతులు మానం దక్కించుకొన్న సంగతి రసవంతంగా వర్ణింపబడినది. ఆయా సన్నివేశాల కనుగుణంగా కథాంశం ఏడు సర్గలుగా విభజింపబడినది.

విద్వాన్ విశ్వంగారు సుప్రసిద్ధ విద్వత్కవులు, సరళహృదయులు, పత్రికా రచయితలు, బహుభాషావేత్తలు. పెన్నేటి పాటవంటి అనేక గ్రంథాలు రచించిన లబ్ధప్రతిష్ఠులు. వీరి విద్వత్తును గురించీ, రచనా వైశిష్ట్యాన్ని, యీ కావ్య గౌరవాన్ని గురించి కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'తొలిమాట'లోనూ, శ్రీ తిరుమల రామచంద్రగారు తమ 'రెండుమాట' లలోనూ వివరించి వున్నారు.

విశ్వంగారు స్వాతంత్ర్య ప్రియులు,, రచనలో

కొత్త కొత్త తీరాలు దిద్ది తీర్చడం ఈయనకెంతో ఇష్టం. అందువల్లనే వీరికావ్యాలలో వైవిధ్యం కాన వస్తుంది. రసవాహినికి అడ్డువచ్చే కట్టుబాట్లను లెక్క చెయ్యరు. వాడుకలో పరిపాటియైన పదాలను స్వేచ్ఛగా వాడతారు. ఈవిషయాన్నే "పారుతున్న నీరెలాగూ పల్లందారులు త్రొక్కుతుంది. పాయలు పాయలుగా చీలిపోతుంది. ఎన్ని గట్టులనో కోసి వేస్తుంది. ఎన్ని మిట్టలనో చదును చేస్తుంది. అది జీవిత ధర్మం" అని వివరించార

ఇందులోని వర్ణనలు నూతనాలు. 'రెక్కల్ తెగి, కాళ్ళు మొలిచి వచ్చిన నగమన పొగబండి దొరల నడకల నడచెన్' పుట 5 'ఒక్క నిమేషము భూకంప మ్మనను, తలపున జూపి రైలు పొడుచుక వచ్చెన్' పుట 6 'రైలు చూడగానె రాణువయే తోచు' పుట 11 మున్నగునవి ఎంతో స్వాభావికంగా ఉన్నవి. ఇలాగే జొన్నచేను వర్ణన, గ్రాసుపోకకు మాటలాడుకొనే పూరిభోగట్టాలు జానపదుల జాతీయాలు, నిత్యవ్యవహారంలోని వారి మాటలు ఆయా ఘట్టాలను కళ్ళకు కట్టిస్తూ ఉన్నాయి. గేటుమాను అనే ఆంగ్లపదానికి 'పొగబండి బాటకాపరి' అనుటయూ, అతని నివాసమైన చిన్న ఇంటిని 'రాతిగూడు' అనడము పొందికగా ఉన్నవి. పొగబండి బాటకు ప్రక్కనే పోతున్న రాణువ బాట ప్రక్కనే పోవడానికి విసుగుకొని రైలుబాటను దాటిపోతూ ఉంటుందట. అందరూ ఎరిగినవైనా ఇలాటివి సాధారణంగా రచనకు అందవు. కథలో ముఖ్యపాత్ర అయిన నాగులమ్మ స్వభావం, జీవన పద్ధతి, నిత్యకృత్యాలు హృదయంగమంగా ఉన్నవి. నవ్యకావ్యాలలో మేలిరకం రచనలకు ఎక్కవలసిన కృతి యిది. సహృదయుడైన శ్రీ విశ్వంగారు రచించిన యీ సహృదయుల కథ సహృదయులైన శ్రీ సీరిపి ఆంజనేయులగారికి కృతి యివ్వడం ఎంతో ఉచితంగా ఉన్నది. ముద్రణా, కాగితం, ముఖచిత్రం, హంపన్న వ్మ తిచిహ్నమైన శాసనపు ఛాయాచిత్రం యీ రచనకు మెరుగు కూరుస్తూ ఉన్నవి.

—ఆంగీరస

## జీ వి తా లు

(నాటకం) రచన : వి. యస్. శాస్త్రి. ప్రచురణ : లీలా పబ్లికేషన్స్ రాజవీధి, వెంకటగిరిటౌన్, నెల్లూరు జిల్లా. పేజీలు. 97, వెల : రెండు రూపాయలు.

గత పదేళ్ళగానూ తెనుగు నాటక ప్రదర్శనాలోనూ, నాటక రచనలోనూ, నిరాశావాదులు ఎంతగా నీళ్ళు నమిలినప్పటికీ, నిజానికి చెప్పుకోదగిన, అభ్యుదయ శిఖరాభిముఖంగా సాగుతోన్న, మార్పే కనిపిస్తోంది. ప్రతీ గ్రామంలోనూ ఒక పరిషత్తు వెలయడం, ప్రతీ వీధిలోనూ ఒక నాటక సమాజం స్థాపింప బడడం, ప్రతీ సమాజం ఒక నాటక రచయితను ఆశ్రయించడం, ఇందుమూలంగా నటనలో ప్రదర్శనలో, రచనలో ఆరోగ్యకరమైన పోటీలు ఎక్కువకావడం జరుగుతోంది. ఒక మంచినాటకం కంటబడినప్పుడు అనేక సమాజాలు ఆ నాటకాన్ని ప్రదర్శించడం కోసం ముందుకు రావడం, ఆ నాటకాన్ని ప్రతిభావంతంగా ప్రదర్శించిన సమాజానికి బహుమతులు రావడం, ఆ రచయిత తన నాటకానికి వచ్చిన ప్రాచుర్యం, ఇచ్చిన ప్రోత్సాహకారణంగా మరికొన్ని క్రొత్త రచనలకు పూనుకోవడం జరుగుతోంది. ఇది నిస్సందేహంగా సాంఘికాభ్యుదయకరమైన పరిణామ విశేషం.

అయితే అట్లా వెలుగులోకి వచ్చిన రచయితలు ఒక్కొక్క మెట్టుగా తమనుతాము మెరుగుపరచుకొంటూ, ఉత్తమ సంస్కారాన్ని అలవర్చుకొంటూ రచనల్లో ప్రదర్శిస్తూ గొప్ప స్థితిలోకి వెళ్ళాలి. శ్రీ శాస్త్రిగారికి వారి 'నామాట' ప్రకారం అనేక పరిషత్తుల ప్రోత్సాహ ప్రోద్బలాలు ఈవరకే లభించిన అదృష్టం కల్గింది. 'జీవితాలు' వారి మాటల ప్రకారమే 'ప్రముఖుల ప్రశంసల నందుకున్నది.' కానీ నాటకం చదివింతర్వాత మాత్రం, ఇది శాస్త్రిగారి మొదటి రచన ఏమో అన్న అనుమానం కలుగుతున్నది. ఈ నాటకాన్ని, సుప్రసిద్ధ ఆంగ్లనవలా రచయిత సోమర్ సెట్‌మామ్ వ్రాసిన 'ది మూన్ అండ్ సిక్స్‌పెన్స్ నవలను' ఆధారమాత్రంగా గైకొని' వ్రాయడం జరిగిందని రచయితే చెప్పుకున్నారు. ఆధార మాత్రంగానే అన్నారు కాబట్టి ఈ నాటకానికీ ఆ నవలకు గల సామ్యాన్ని పరిశీలించడం కూడా ఇంక అవసరమే! అట్లా పోల్చినపుడెల్లా శ్రీ శాస్త్రిగారికి అన్యాయం జరగడం తథ్యం.

పోనీ, 'జీవితాలు' నాటకాన్ని ఒక స్వతంత్ర రచనగా పరిగణించి పరిశీలించినా, అసంతృప్తి తప్ప మరేమీ మిగలదు. నాటకం నాల్గు రంగాల రచన. ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరిస్తే నాటకం అయిదు అంకాల రచనగా ఉండవలసింది. ఆధునిక పద్ధతుల ననుసరిస్తే మూడంకాల రచన కావలసింది. అట్లా కూడా కాకపోతే 'ఏకాంకి' కావాలి అదీ ఇదీ కాకుండా 'జీవితాలు' నాల్గు రంగాల నాటకమైంది. రంగము అంటే వారి దృష్టిలో 'Act' అనా, లేక 'Scene' అనా? నాటకంలో వున్న మొత్తం పాత్రలు ఏడు. అందులో రెండు స్త్రీ పాత్రలు. మదన, మధు, రెండు ముఖ్యమైన మగ పాత్రలు, చిత్రకారులు. గోపీ అనే మరో మగ పాత్ర, ఆ ఇద్దరు చిత్రకారులకు స్నేహితుడు. సరోజ మధు భార్య. సుమతి మధు ఇంటి పనిమనిషి. మదన శీల ప్రవృత్తి రాక్షసం. అందాన్ని అనుభవించి వాడి వత్తలైతే నలిపి ఆవల పారవేయడం. సరోజ ఒకనాడు పతిత. నాటక ప్రారంభానికి మధుచేత ఉద్ధరింప బడి ఉత్తమ ఇల్లాలుగా బ్రతుకుతున్న, 'దేవత' మళ్ళీ 'దేవత'కాస్తా 'దయ్యమై', మదనచే శీలం చెడగొట్టుకుంటుంది. సుమతి కూడా మదనచేత భంగపడిన మరో ఆడది. చివరకు మదన రోగగ్రస్తుడై మరణించే సమయంలో, ఆడవాళ్ళిద్దరూ కూడా ఆత్మహత్య చేసుకుంటారు—గోపీ, మధు నిర్జీవంగా చూస్తూవుండగా. ముగ్గురు చెడిపోయిన మనుష్యులూ, ఇద్దరు ఏమీ చేయలేని, చేతగాని మగవాళ్ళూ, ఆకృతి సరిగా అమరని మరో రెండు చిన్న పాత్రలూ, వెరసి ఏడుపాత్రలతో, కళ అన్న ముసుగు కప్పుకున్న అర్థంలేని తర్కంతో ఆశ్లీలాన్ని నాటకీయతతో జోడించి, అర్థరహితంగా సాగిన రచన 'జీవితాలు' ఈ నాటకం వేంకటగిరి సంస్థానాధీశులు వెలుగోటి కృష్ణయాచేంద్రుల వారికి అంకితం చీయబడింది. రామచంద్ర అప్పారావుగారి పేర "కళకు సందేశం ఎందుకు?" అంటూ ఎందుకో కొన్ని అర్థం తెలీని వాక్యాలు ఇందులో మందు పేజీలో వున్నాయి. 'మధు, సుమతులిద్దరూ పవిత్ర మూర్తులు' అంటూ ఆదిభట్ల వేంకటరమణగారు అభిప్రాయం వెలిబుచ్చిన 'శుభాశీస్సు' ఈ పుస్తకంలో వుంది. ఆ పాత్రలు రెండూ పవిత్ర మూర్తులంటూ ధైర్యంగా అభిప్రాయం వెలిబుచ్చిన ఆంధ్రోపాధ్యాయులు ఆదిభట్ల రమణగారి సాహసాన్ని చూసి పాఠకులు ముక్కుమీద వేలు వేసుకోవడం కన్న మరేమీ చేయలేరు.

—శ్రీరామచంద్రమూర్తి

## రచయితలకి మనవి

1—4—1966 తర్వాత వ్రాత ప్రతులని తిప్పి పంపే విషయమై కొత్త పద్ధతిని అవలంబించవలసి వస్తున్నది. 1—4—1966 వరకూ మా కార్యాలయం చేరే వ్రాత ప్రతులతోబాటు తగు మాత్రం తపాలా బిళ్ళలు జత పరనినట్లయితే తిప్పి పంపే ప్రయత్నాలు ఎప్పటిలాగే జరుగుతాయి.

1—4—1966 తర్వాత మా కార్యాలయానికి చేరే వ్రాత ప్రతులతో బాటు రచయిత (త్రు) లు తమ పేరు: చిరునామాతోబాటు తగు మాత్రం తపాలా బిళ్ళలు అతికించిన కవరులు పంపాలి. ఆ తేదీ తర్వాత ఇటువంటి (సెల్ఫ్ ఎడ్రెస్డ్ ఎన్వలప్స్ విత్ పోస్టేజ్) కవరులతోబాటు వచ్చిన వ్రాత ప్రతులే తిప్పి పంపటం జరుగుతుంది.

**ఉత్త తపాలా బిళ్ళలు జతపరచి పంపరాదు !**

రచయితలు ఈ నిబంధనని గమనించి ఎప్పటివలె మాతో సహకరింప గలరని ఆశిస్తున్నాము.

సంపాదకుడు,
ఆంధ్ర సచిత్ర వార పత్రిక.

## స వ ర ణ

25-2-66 వ తేదీ సచిత్ర వారపత్రిక 56 వ పేజీలోని నవ్య రచనామండలివారి ప్రకటనలో 3 వ అంశం "శిక్ష" రచయిత పేరు "ఖండవల్లి సాంబశివరావు", అని, 7 వ అంశం "కాసుల దండ", "కన్నీటి కాపురం", "కాల భ్రమణం" రచయితపేరు "గుంటి సుబ్రహ్మణ్య శర్మ" అని, 9 వ అంశం పుస్తకం పేరు "లికులీస" అని ప్రచురణ అయినది. రచయితల పేర్లు "ఖండవిల్లి సాంబశివరావు", "గుంటి సుబ్రహ్మణ్యేశ్వర శర్మ" అని, పుస్తకంపేరు "అకులిస" అని సవరించి చదువుకొన పాఠకులను కోరడమైనది.




Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7Thambu chetty Street Madras-1. Phones ; Editorial, 21747; Other depts · 29766. Chief Editor: S. Sambhu Prasad.

